





# కథలు

నీతి, పురాణ, పొడుపు

# దిక్కులు లేని దీనురాలు





## సదాశివ సమారంభాం



గురు దక్షిణామూర్తి



గురు వేదవ్యాస మహర్షి



గురు శుక మహర్షి



గురు నారద మహర్షి



గురు వాల్మీకి మహర్షి



గురు శ్రీకృష్ణ

## శంకరాచార్య మధ్యమాం



గురు దత్తాత్రేయ



గురు బాబాజీ



గురు గౌతమ బుద్ధ



గురు ఆదిశంకరాచార్య



గురు రామానుజాచార్యులు



గురు జ్ఞానేశ్వర్



గురు రవిదాస్



గురు కబీర్ దాస్



గురు చైతన్య మహా ప్రభువు



గురు నానక్



గురు రాఘవేంద్ర స్వామి



గురు వీరబ్రహ్మేంద్ర స్వామి



యోగి వేమన

## అస్మదాచార్య పర్యంతాం



గురు త్రైలింగ స్వామి



గురు లాహిరి మహాశయ





గురు రామకృష్ణ పరమహంస, అమ్మ శారదాదేవి



గురు వివేకానంద



గురు సాయి బాబా



గురు అరబిందో



గురు రమణ మహర్షి



గురు యోగానంద



గురు భక్తివేదాంత ప్రభుపాద



గురు మళయాళస్వామి



గురు విద్యాప్రకాశానందగిరి



గురు చంద్రశేఖర పరమాచార్య

## వందే గురుపరంపరాం..





నన్ను "నేను" తెలుసుకోవటానికి

నన్ను "నేను" మార్చుకోవటానికి

"నేను" గా ఉండటానికి

మరియు అత్యుత్తమ జీవన విధానానికి

కావలసిన భక్తి,జ్ఞాన,కర్మ,ధర్మ సమాచారం ఒకేచోట తెలుగులో ఉచితంగా!

సాధారణంగా వేదాంతం తెలుసుకోవాలనే కోరిక వుంటుంది, కాని గ్రంధాలు అందుబాటులో లేవు. ఇంకొకరి దగ్గర గ్రంధాలు వుంటాయి, కాని జిజ్ఞాసువులకి ఎక్కడ ఉన్నవో తెలియదు. అలాగే కొన్ని లైబ్రరీ లో కొన్ని రకాల పుస్తకాలు మాత్రమే లభ్యం అవుతున్నాయి, అంతేగాక విలువైన గ్రంధాలు సరైన సంరక్షణ లేక కనుమరుగైపోతున్నాయి, కనుక మన అందరి కోసం భారత ప్రభుత్వం పురాతన ఆధ్యాత్మిక గ్రంధాలను సంరక్షించే నిమిత్తం ఎంతో శ్రమతో కంప్యూటరీకరణ ద్వారా ఒక చోట చేర్చుతూ ఆన్ లైన్ చేయటం జరిగింది. ఇటువంటి విలువైన జ్ఞాన సంపదను మరింత సులభంగా అందుబాటులోకి తీసుకురావటానికి సాయి రామ్ సేవక బృందం ఉడతా భక్తి గా ఇప్పటివరకి దాదాపు **5000** పుస్తకాలను వివిధ వర్గాలుగా విభజించి PDF(eBOOK) రూపంలో ఆన్ లైన్ లో ఉచితంగా అందించటం జరిగింది. కనుక ప్రతి ఒక్కరు ఈ సదవకాశాన్ని సద్వినియోగం చేసుకోగలరు. ఇందుకు సహాయం అందించిన భారత ప్రభుత్వపు వెబ్ సైట్( డిజిటల్ లైబ్రరీ ఆఫ్ ఇండియా http://www.new.dli.ernet.in), ఆర్కైవ్ వెబ్ సైట్(https://archive.org), గూగుల్ వెబ్ సైట్(https://www.google.co.in), మైక్రోసాఫ్ట్ వెబ్ సైట్(http://www.microsoft.com) కు మేము ఋణపడివున్నాము.అలాగే ఇటువంటి బృహత్తర కార్యక్రమానికి పెద్ద మొత్తం లో గ్రంధాలను అందించిన తిరుమల తిరుపతి దేవస్థానమునకు కూడా మనం ఋణపడివున్నాము. సాయి రామ్ సేవక బృందం కోరుకొనేది ఒక్కటే, ప్రతి ఇల్లు ఆధ్యాత్మిక జ్ఞాన గ్రంధాలతో నిండిపోవాలన్నదే మా కోరిక.

ఈ గ్రంధాలను ఉచితంగా ఆన్ లైన్ లో చదువుటకు, దిగుమతి(డౌన్లోడ్) చేసుకొనుటకు గల మార్గాలు:

1) భారత ప్రభుత్వపు వెబ్ సైట్: http://www.new.dli.ernet.in లేక http://www.dli.ernet.in
2) సాయి రామ్ వెబ్ సైట్: http://www.sairealattitudemanagement.org
3) సాయి రామ్ గూగుల్ సైట్: https://sites.google.com/site/sairealattitudemanagement
4) ఆర్కైవ్ వెబ్ సైట్: https://archive.org/details/SaiRealAttitudeManagement

ఈ జ్ఞాన యజ్ఞం పై గల సలహాలు,సూచనలకు సేవక బృందాన్ని సంప్రదించుటకు: sairealattitudemgt@gmail.com

సాయి రామ్ భక్తి,జ్ఞాన సమాచారం: https://www.facebook.com/SaiRealAttitudeManagement

సాయి రామ్ భక్తి,జ్ఞాన సంబంద వీడియోలు: https://www.youtube.com/user/sairealattitudemgt

ఈ జ్ఞాన యజ్ఞంలో ప్రతి ఒక్కరు పాల్గొని, ఈ అవకాశాన్ని సద్వినియోగం చేసుకొని,మీరు సంతృప్తులైతే మరొక సాధకునికి, జిజ్ఞాసువులకు మార్గం చూపించగలరని ఆశిస్తున్నాము. మీరు చదువుకోవటంలో ఏమైనా ఇబ్బంది కలిగితే సేవక బృందంను సంప్రదించగలరు. ఒకవేళ మా సేవలో ఏమైన పొరపాటు వస్తే మన్నించగలరు.

ఈ గ్రంధపు భారత ప్రభుత్వ డిజిటల్ లైబ్రరీ గుర్తింపు సంఖ్య: 2020010004919

గమనిక: భక్తి,జ్ఞాన ప్రచారార్ధం **ఉచితంగా eBook** రూపంలో భారత ప్రభుత్వపు సహాయంతో ఇవ్వడం జరిగింది. ఈ గ్రంధముపై వ్యాపార,ముద్రణ హక్కులు రచయిత,పబ్లిషర్స్ కి గలవు, కనుక వారిని సంప్రదించగలరని మనవి చేసుకొంటున్నాము.

**S**ai**R**eal**A**ttitude**M**anagement(SAI RAM) - సాయి నిజ వ్యక్తిత్వ నిర్వహణ(సాయి రామ్)

* సర్వం శ్రీ సాయినాథ పాద సమర్పణమస్తు *

## భారత ప్రభుత్వపు వెబ్ సైట్ - డిజిటల్ లైబ్రరీ అఫ్ ఇండియా

## http://www.new.dli.ernet.in

Digital Library of India: Inc ×

www.new.dli.ernet.in

Digital Library of India

Hosted by: Indian Institute of Science, Bangalore in co-operation with
CMU, IIIT-H, NSF, ERNET and MCIT for the Govt. of India and 21 major participating centres.

Home | Vision | Mission | Goals | Benefits | Content Selection | Current Status | People | Funding | Copyright Policy | FAQ | RFP

Books Journals Newspapers
Palm-Leaves (Manuscripts)

Title: Ramayanam
Author:
Year: to
Subject: Any Subject
Language: Telugu
Scanning Centre: Any Centre
Clear | Search

Presentations and Report
Statistics Report
Status Report
Feedback | Suggestions | Problems | Missing links or Books

Click here for PDF collection
DLI MIRROR at IUCAA Data Center PUNE

DLI

For the first time in history, the Digital Library of India is digitizing all the significant works of Mankind.

Click Here to know More about DLI New!

| Books | Journals | Newspapers | Manuscripts |
|---|---|---|---|
| Rashtrapati Bhavan | INSA | Times of India | Tamil Heritage Foundation |
| CMU-Books | | Indian Express | AnnaUniversity NEW! |
| Sanskrit | | The Hindu | |
| TTD,Tirupathi | | Deccan Herald | |
| Kerala Sahitya Akademi | | Eenadu | |
| | | Vaartha | |

Title Beginning with.

A B C D E F G H I J K L M N O P Q R S T U V W X Y Z

Author's Last Name

A B C D E F G H I J K L M N O P Q R S T U V W X Y Z

Year

1850-1900 | 1901-1910 | 1911-1920 | 1921-1930 | 1931-1940 | 1941-1950 | 1951-

Subject

Astrophysics | Biology | Chemistry | Education | Law | Mathematics | Mythology | Religion | For more subjects...

Language

Sanskrit | English | Bengali | Hindi | Kannada | Marathi | Tamil | Telugu | Urdu

# అతి విశిష్టం ఈ దానం!

స్వామి వివేకానంద

"దానాలలోకెల్లా ఆధ్యాత్మిక విద్యాదానం చాలా శ్రేష్ఠమైంది! దాని తరువాతిది లౌకిక జ్ఞానదానం, ప్రాణదానం, అన్నదానం" అని వ్యాసమహర్షి చెప్పారు.

మన ఆధ్యాత్మిక జ్ఞానం భారతదేశ హద్దులలో నిలిచి పోకూడదు. లోకమంతటినీ ఆవరించాలి! ఇలా లోకవ్యాప్తమైన ధర్మప్రచారాన్ని మన పూర్వులు చేశారు. హైందవ వేదాంతం ఎన్నడూ ఈ దేశం దాటి పోలేదని చెప్పేవారూ, మతప్రచారార్థం తొలిసారిగా, పరదేశాలకు వెళ్ళిన సన్న్యాసిని నేనే అని చెప్పేవారూ, తమ జాతిచరిత్ర నెరుగని వారే! ఇలాంటి సంఘటనలు ఎన్నోసార్లు జరిగాయి. అవసరమైనప్పుడల్లా, భారతీయ ఆధ్యాత్మిక జ్ఞానప్రవాహం వెల్లువలా లోకాన్ని ముంచెత్తుతూ వచ్చింది.

రాజకీయ ప్రచారాన్ని రణగొణధ్వనులతో, యోధులతో సాగించవచ్చు. అగ్నిని కురిపించి, కత్తిని ఝళిపించి, లౌకిక జ్ఞానాన్నీ, సంఘనిర్మాణ విజ్ఞానాన్నీ విరివిగా ప్రచారం చేయవచ్చు. కానీ ఆధ్యాత్మిక జ్ఞానదానం కళ్ళకు కనిపించకుండా, చెవులకు వినిపించకుండా కురుస్తూ, రోజా పువ్వుల రాసుల్ని వికసింపజేసే మంచులాగా నిశ్శబ్దంగా జరగవలసి ఉంది. భారతదేశం నిరాడంబరంగా, లోకానికి మళ్ళీ మళ్ళీ చేస్తూ వచ్చిన దానమిదే!

మిత్రులారా! నేను అవలంబించే విధానాన్ని తెలియజేస్తాను వినండి. భారతదేశంలోనూ, ఇతర దేశాల్లోనూ మన పారమార్థిక ధర్మాలను బోధించడానికి తగినవారుగా మన యువకుల్ని తయారు చేయడానికై భారతదేశంలో కొన్ని సంస్థలను నెలకొల్పాలి! ఇప్పుడు మనకు కావలసింది బలిష్ఠులు, జవసంపన్నులు, ఋజువర్తనులు, ఆత్మ విశ్వాసపరులు అయిన యువకులు. అలాంటి వారు నూరుమంది దొరికినా, ప్రపంచం పూర్తిగా పరివర్తన చెందగలుగుతుంది!!

ఇచ్ఛాశక్తి తక్కిన శక్తులన్నిటి కన్నా బలవత్తరమైంది. అది సాక్షాత్తూ భగవంతుని దగ్గరి నుండి వచ్చేదే కాబట్టి దాని ముందు తక్కినదంతా లొంగిపోవలసిందే. నిర్మలం, బలిష్ఠం అయిన 'ఇచ్ఛ' (సంకల్పం) సర్వశక్తిమంతమైంది. దానిలో మీకు విశ్వాసం లేదా? ఉంటే మీ మతంలోని మహోన్నత ధర్మాలను ప్రపంచానికి బోధించడానికై కంకణం కట్టుకోండి. ప్రపంచం ఆ ధర్మాల కోసమై ఎదురుచూస్తోంది. అనేక శతాబ్దాలుగా ప్రజలకు క్షుద్రసిద్ధాంతాలు నేర్పడం జరిగింది. వారు వ్యర్థులని ప్రపంచమంతటా బోధలు జరిగాయి. ఎన్నో శతాబ్దాల నుండి వారు ఈ బోధనల వల్ల భయభ్రాంతులై, పశుప్రాయులైపోతున్నారు. తాము ఆత్మస్వరూపులమనే మాటను వినడానికైనా వారెన్నడూ నోచుకోలేదు. "నీచాతినీచుడిలో కూడా ఆత్మ ఉంది. అది అమృతం, పరమ పవిత్రం, సర్వశక్తిమంతం, సర్వవ్యాపకమైనది" అని వారికి ఆత్మను గురించి చెప్పండి. వారికి ఆత్మవిశ్వాసాన్ని ప్రసాదించండి. ❖



మూలం: శ్రీ రామకృష్ణ ప్రభ - ఫిబ్రవరి 2014

# దిక్కులేని దీనురాలు



రచన:
రవీంద్రనాథ్ టాగూర్



జయా పబ్లికేషన్సు
విజయవాడ-2

# మూగపిల్ల

అనగనగా వొక బాలిక. పేరు 'సుభాషిణి'. నామకరణం నాడే బిడ్డ మూగపిల్ల అవుతుందని ఏ తల్లిదండ్రులూహించగలరు; పాపం ఆ బాలికకు యిద్దరు అక్కలున్నారు. సుకేశిని, సుహాసిని అని వాళ్ళ పేర్లు - వుంచి పెట్టారు. ఆ పేర్లలోని అనుప్రాసను తప్పనివ్వకుండా తల్లిదండ్రులు కడసారిపిల్లకు 'సుభాషిణి' అని పేరు పెట్టుకున్నారు. క్లుప్తంగా 'సుభా' అని పిలవజొచ్చారు.

వరుని వెదకడంలోను, కట్నాలు కానుకలు యివ్వడంలోను - సర్వసాధారణంగా వివాహంలో పడేపాట్లన్నీ పడి ఎలాగో పెద్దపిల్లల నిద్దర్నీ విరగడ జేశారు. ఇకనల్లా కడగొట్టు బిడ్డే మిగిలి వుంది. తల్లిదండ్రుల గుండెలమీద ఎత్తైన కనబడని బరువులాగా ఆ బాలిక యీడేరి యింట్లో కూర్చొని వుంది. ఆమెకు నోరు లోపించింది కనుక భావానుభూతికూడా తప్పక లోపిస్తుందనే లోకం తలంచినట్లుగా వుంది. అధీనూతోనే ఆమె సమక్షంలోనే ఆమె భవిష్యత్తునుగూర్చి చర్చించి ఆందోళన చెందేవాళ్ళు. దానితో తన పితృగృహంపై కినిసి భగవంతుడంపిన శాపంలావున్నానని తనస్థితిని చిన్నతనంలోనే సుభాఅర్థం చేసుకొంది. అందుకని నలుగురిలోకీ రావడం మానింది. ఆటల పాటల స్నేహాల ప్రసక్తే మానుకొంది. ఏకాంతంగా వేరుగా వుండిపోయేది. తన్నెవ్వరూ తలపకుండా మరచిపోతే చాలు,

లోకం తనకు మహోపకారం చేసినట్టు - భరించవచ్చు అనుకొనేది. కాని బాధను మరవడం ఎవరికి శక్యం? రాత్రింబవళ్ళు యీ బిడ్డనుగూర్చిన ఆందోళనే తల్లిదండ్రుల మనసుల్ని వేధించింది.

తల్లి కళ్ళల్లో ఆమెవొక విరూపిగా వుంది. కొడుకు కన్నా కూతురు తల్లికి స్వీయాంశగా వుంటుంది. కూతురులోని వెలితి ప్రత్యేకించి తల్లికి గౌరవహాని అనిపిస్తుంది. అందుకే 'సుభా' అంటే తల్లికి తన శరీరంమీద ఏదో మచ్చకుమల్లే ఏవగింపు. తండ్రి వాణీకాంతుడు—తన సంతానంలోకల్లా 'సుభా' యెడలే అనురాగం మెండు ఆయనకు.

సుభాకు మాటలోపించిందిగాని ధనురాకారంలో తీర్చిదిద్దిన దీర్ఘమైన కనుబొమ్మలు అంచులుగాగల చేరడేసి నీలలోచనాలకు కొదవగలగలేదు. ఆ బాలిక మనసులో మెదలిన భావాలను అనుసరించి ఆమె కెంబెదవులు చిగురాకులా కంపించేవి.

భావాలను వ్యక్తం చేసేప్పుడు అనుగుణమైన భాష అంత సులువుగా పట్టుబడదు. అదొక అనువాదక్రమం. ఆ అనువాదం తరచు సంతృప్తికరంగా వుండదు. అపలాపాలుంటాయి. భాషతో నిమిత్తం లేని యీ నీలలోచనాలకి అనువాదపు బెడదలుండవు. కళ్ళల్లో మనస్సు నీడే సూటిగా ప్రతిఫలిస్తుంటుంది భావం మనస్సులో విప్పారినా, ముడిగినా, మెరిసినా, యిరులలో మాయమైనా - అస్తమించే పాలిపోయిన చంద్రవంకలా నిస్సత్తువగా కాసేపు నిల్చిపోయినా, ఆకాశం మూలమూలల్ని కనురెప్పపాటులో కాంతిసంపన్న మొనర్చే విద్యుల్లతలా కదలినా

— ఆ నీలలోచనాల దర్పణంలో ఛాయలుగా తోచక విధి లేదు. పెదిమెలు కదల్పడంకన్నా వేరే భాషలేని పుట్టుమూగకు నేత్రభాష అలవడుతుంది. ఆ భాషయొక్క వ్యంజన అనంతం; సముద్రంవలె అగాధం; ఉదయాస్తమయాలు, వెలుగు చీకట్లూ దోబూచులాడుకొనే ఖగోళ జ్యోతులవలె విస్పష్టం. ప్రకృతి మాతలో కానవచ్చే ఏకాంత వైభవం మూగవారికి వశమవుతుంది. అందుచేతే పొరుగు పిల్లలు సుభాఅంటే భయపడేవారు. ఎడంగా వుండేవారు. ఆటపాటలకై కూడా కలిసేవారుకారు. నిర్జనమైన మధ్యాహ్నయామంవలె ఆమె నిశ్శబ్దంగా, ఏకాకిగా చరించేది.

ఆమె స్వగ్రామంపేరు చండీపూర్ - అదివొక చిన్న నది వొడ్డున వున్నది. అసలు బెంగాల్ నదులన్నీ చిన్నవే. ఇల్లువెడలని మధ్యతరగతి మర్యాదస్తులకుటుంబంలో పుట్టి పెరిగిన ఆడుబిడ్డలా కరకట్టలను మీరకుండా బిరబిరా ప్రవహిస్తూ తనదారిన తాను పోతుంటుంది. తన తటాంచల గ్రామాదుల్లో ప్రతియింటికీ పని కత్తెగా తనవిధులు తీర్చుకుంటూ విశ్రాంతి ఎరగని ప్రయాణం చేస్తుంది. ఏటికిరుగట్లా యిళ్లువాకిళ్ళు వున్నాయి; హాయిసుని నీడనిచ్చే చెట్లున్నాయి. కొండకోనలగద్దె దిగివచ్చి మైదానంలో పడిందాది ఆ నదీదేవత యింటింటికీ వుద్యానవనదేవత అయింది. తన్నుతానే మరచిన పారవశ్యంలో పరుగెత్తిపోతూ దయామయంగా ఎంతో పరిచర్య చేస్తోంది.

వాణీకాంతుని గృహాన్ని ఏట్లోనుండి చూడొచ్చు. ఆ వూరిలో ప్రతిగుడిసె, ప్రతి చావడి ఏటిలో వొడగడపే నావికుల కళ్ళకు కనుమాటి దాగుకోలేవు. సుభా రోజూ పని పూర్తిజేసు

కోవడంతోనే బయల్దేరి నడిచప్పుడూ లేకుండా పటిరిన్నెకు వెళ్ళి కూర్చొనేది. ప్రాపంచికమైన జంజాటంలో బడి ఏ నావికు డైనా పటిగట్టున యీ బాలికను గమనిస్తున్నాడో లేదో చెప్ప లేము.

కాని ప్రకృతిమాత ఆ బాలికలోని వాచాలోపాన్ని భర్తీ చేయడానికి ఆమెకు బదులుగా తానే మాట్లాడేది. సెల యేటి మర్మరం, జానపదుల సంభాషణలు, నోడసరంగు తీయని పల్లెపదాలు, పక్షిజాతం కూజితాలు, చెట్ల పీసనలు - అన్నీ కలిసి ఆమె హృదయస్పందనంతో ఏకీభూతమయ్యాయి అవన్నీ నొక అపూర్వనాద తరంగమై అలసిన ఆమెగుండెలపై నినదిస్తు న్నాయి. ప్రకృతిదేవియొక్క యీ మర్మర చలనమే ఆ మూగ బాలికయొక్క భాష. విల్లువంటి కనుబొమ్మలంచుగట్టిన ఆ నీలలోచనాల భాషే ఆమె నక్కడావరించిన ప్రపంచంలోని భాష.

మిట్టమధ్యాహ్న ఘడియలలో నావికులు, బస్తీలు భోజనాలకై వెళ్ళిపోతారు. గ్రామీణులు ప్రూగన్ను సెట్టి పరుం టారు. పక్షులు నిశ్శబ్దసుప్తాయి. రహదారి సడవలు విశ్ర మిస్తాయి. బహు వ్యాపకాలతో వేగే ప్రపంచం [illegible] పని నిలిపి, హఠాత్తుగా ఏకాంతపు [illegible] ప్రపన్నరాశిగా మారిపోతుంది, అపుడు విస్తారవి[illegible] క్రింద నిశ్శబ్దంగా యిద్దరు కూర్చుంటారు :- వొకరు ప్రకృతి, వేరొకరు మూగ బాలిక. వొకరు చండభానునిక్రిందా - నురొకరు చిన్న చెట్టు పరపిన నీడపట్టునా ప్రపనిష్టులౌతారు.

అంతేయికసుభాకు స్నేహితులసలే లేరనుకోవద్దు. వాళ్ళ దొడ్లో సర్వాభి, పంగుళి అనే రెండు గంగిగోవులున్నాయి. వాటి పేర్లు పెట్టి నోరారా నోరూరా ఆమె వాటిని ఏనాడూపిలిచి ఎర గదు. వస్తోందనగా ఆమె అడుగుల చప్పుడును బట్టి అవి ఆమె రాకను తెలుసుకొనేవి. ఆమె మాట లుచ్చరించ లేకపోయినా మూగగా ముచ్చటగా గొణిగేది. స్ఫుటమైన వుచ్చారణకన్నా మృదువైన ఆ గొణుగుడే వాటికి సులభంగా బోధపడేది. ఆమె వాటిని గోముగా బుజ్జగించినా, కోపంతో కసరినా, బ్రతిమాలినా మనుష్యులకన్నా అవే చక్కగా అర్థం చేసు కునేవి. సుభా పశుకోష్ఠాని కొస్తుంది. వచ్చీరావడంతోనే సర్వాభి మెడకు తనచేతులు చుట్టేస్తుంది, తన చెక్కిలినిగోవు చెక్కిలి కానించి మెల్లగా పాముతుంది. ఇంతలో పంగుళిపార్ద్రిన యనాలుసారించి నాలుకసాచి ఆమె మొగాన్ని నాకుతుంటుంది. సుభాదినానికి కనీసం ముమ్మారు కొట్టంలోకివచ్చి వెళ్తుంది-అది ఆమె నియమం. ఇంకా ఎక్కువమార్లు వచ్చి వెళ్ళడం కూడా కద్దు. పరుషోక్తులు పడవలసివచ్చి, ఎదకుంది నప్పుడల్లా యీ మూగ నేస్తుల వద్దకు వచ్చేస్తుంటుంది. అలా రావడానికి ఏవేళా అడ్డురాదు. ఆమెనీరవచింతాపూర్ణదృక్కుల మూలంగా గోవులామె ఆత్మక్షోభను కనిపెట్టినట్టే అగుపిస్తాయి.

గోవు మాణిక్యాలే ఆమెకు చేరువగా వచ్చి కొమ్ములతో అలాకనగా ఆమె చేతులను రాచుకొంటాయి. మూగగా, ఉద్వి గ్నంగా ఆమెను ఓదార్చ బూనుకొంటాయి. గోవు నేస్తాలే గాకుండా, మేకపిల్ల, వొక పిల్లికూన కూడా ఆమె స్నేహిత బృందంలో వున్నాయి. అయితే అవి యీామెయెడగ ట్టిబంధం

పెర్పరచుకొన్నా వాటియెడ ఆమెకంత ఆత్మీయత లేదు. అందులో ఆ పిల్లికూన రాత్రిగాని, పగలుగాని సమయం దొరికి నప్పుడల్లా ఆమె వొడిలోకి అట్టేదూకి నిద్రపోతుంది. సుఖా దాని మెడా వీపూ వేళ్ళతో నిమురతూ నిద్రపుచ్చుతుంటుంది. అందుకు దాని తృప్తిని వెల్లడిస్తుంటుంది.

ఈ చతుష్పాత్తుల్లోనే గాక ద్విపాద జంతువుల్లో కూడా సుఖాకొక నేస్తుడున్నాడు. అతనితోడి బంధం ఎటువంటిదో చెప్పడందుష్కరం. అతనికి వాచా వుంది; అందుచే వారిద్దరికీ అర్థ మయ్యే భాష లేకపోయింది. వాడు గోసాయనుల కడసారపు కుఱ్ఱవాడు. పేరు ప్రతాపుడు. సోమరి. ప్రయత్నించి ప్రయ త్నించి తల్లిదండ్రులు వాడేనాటికైనా జీవనోపాధి చూసుకోగల డనే ఆశ కాస్తా వదులుకొన్నారు. వాడొక తిరుగుబోతు. ఆత్మీ యులైనవారు వాణ్ణి ఏవగించుకున్నప్పటికీ కడమ వూరివారందరితోనూ చనువుగా, మంచిగా వుంటాడు. పనిపాటలులేనివాళ్ళై యిటువంటివారు వూరివుమ్మడి సొత్తుగా పరిగణింపుకెక్కుతారు. షికారుకు వెళ్ళి శుభ్రవాయువు పీల్చడానికి పట్నంలో బహిరంగ స్థలం అవసరమైనట్లే గ్రామానికి యిద్దరుముగ్గురు సదా తీరుబడి జీవాలు కావాల్సివుంటారు. వారి పుణ్యమాఅంటూ అందరికీ కాలం వెళ్ళమారుతుంది. ఏమీ తోచకపోతే, వూసులేసుకుని పొద్దుగడిపేస్నేహితుడు కావాలంటే ఇటువంటి బాతా సిద్ధంగా ఎల్లప్పుడూ ఖానీరాయుళ్ళు చేతికి దొరుకుతారు.

ప్రతాపుడు పెట్టుకొన్న వ్యాపకం చేపల్ని పట్టడం. కాలమంతా ఎక్కువ యీ వ్యాపకంలోనే గడిపేస్తాడు. ప్రతి మధ్యాహ్నం అతనా పనిలోనే కనిపిస్తాడు. ఆ వ్యాపకంవల్లనే

అతడు ప్రతినిత్యం సుభాను కలుసుకోగల్గుతాడు. అతనేమి తల పెట్టినా అందుకొక సలహాదారు, స్నేహితుడు అవశ్యం కావాలి; చేపలకు గాలమేసేటప్పుడు నిశ్శబ్దంగా కూర్చోగల నేస్తమయితే అన్నింటికన్నా మంచిది.

ఇంకేం, సుభాలో ఆ నిశ్శబ్ద స్వభావముంది. ప్రతాపు డందుకే ఆమెనక్కడ ఆవేళకు అభిలషిస్తుంటాడు. ఆమెనందరూ సుభా అనిపిలిస్తే ప్రతాపుడు అప్యాయతకొలది 'సూ' అని పిల్చేవాడు. చింతమానునీడలో సుభాకూర్చుంటే, యింకాస్త దూరంలో ప్రతాపుడు కూర్చుని గాలంవేసేవాడు. ప్రతాపుడు యిన్ని ఆకులు తెచ్చేవాడు; వాటితో 'సూ' తాంబూలం సిద్ధపరచేది. కూర్చొని చాలాతడవు పరికిస్తూ ప్రతాపుడికేదో పెద్దగా సాయపడాలని ఆందోళన పడుతూ వుండేదని నా నమ్మకం. అలా సాయపడటంద్వారా ఆమె భూమికి బరువుచేటుమాత్రం కాదని నిరర్థకంకాదని నిరూపించుకోవాలని వుద్దేశించేది. కాని తాను చెయ్యడానికేమీలేదు. అప్పుడాబాలిక దేవదేవుని ప్రార్థించేది. అపురూపశక్తినేదో ప్రసాదిస్తే వొకగొప్పకార్యం ఘనంగా చేసి 'అమ్మో! మన 'సూ' ఇంత చేస్తుందని కలలోకూడా అనుకోలేదే'అని ప్రతాపుడి నోట ఆశ్చర్యార్థం రాబట్టాలని వుబలాటపడేది.

సుభా జలదేవతే అవునా, రసాతలంలోని నాగరాజు కిరీటంలోని మాణిక్యాన్ని పెకలించి దోసిటలో పెట్టుకొని జలంలోనుండి నెమ్మదిగా నిర్గమించి వొడ్డుజేర్చేది. అంతటితో పాడు చేపలవేట చాలించి ప్రతాపుడు నీటిలోదూకి రసాతలంలోకి మునకయీతలోవెళ్లి పదంతస్తుల వెండిమేడలో బంగారు తల్పం

మీద ఒక యువతీమణియొక్క దర్శనభాగ్యం పొందేవాడు. ఆ యువతీమణి వాటికాంతుని సోదరు, 'సూ'కన్నా అతనికి మరెవ్వరవుతారు? ధగధగాయమానంగా మెరిసే ఆ మాణిక్య నగరంయొక్క రాజుగారి కుమార్తె 'సూ'ను చూసేవాడు. కాని పాపం, ఇటొక్కటే సాధ్యంగాని పనిగాని తక్కినవన్నీ సుసాధ్యాలే. పాటలీపుత్ర రాజప్రాసాదంలో గాకుండా ఆమె వాటికాంతుని ఇంట జనించిందాయె! దానితో గోసాయినుల కుర్రవాణ్ణి చకితుణ్ణిచేసే సంఘటన విశేషాలు దొరకక పాతాళ అయ్యేది.

పెరిగి పెద్దదయ్యింది. క్రమక్రమంగా తన్నుతాను తెలుసుకో నారంభించింది. పౌర్ణమినాడు సముద్రగర్భగోళం నుండి పొడుచుకు లేచే కెరటంలా చెప్పనలవిగాని నూతన చేతనస్ఫూర్తి ఆమెలో అలముకుంది. తన ప్రశ్నకు తానర్థం చేసుకోగల సమాధానం లభించలేదు.

ఒక పున్నమిరాత్రి నడిజామున లేచి, తన గదితలుపులు మెల్లగా తెరచి వెన్నెల్లోకిరూడాపిరికిగా తొంగిచూసింది. రాకాచంద్రికలో సుభావలెనే ప్రకృతి ఆదమరచి నిద్రిస్తున్న భూదేవిని గాంచుతోంది. అంతట సుభాలో బలీయమైన పడుచుదనం స్పందించింది. మోదఖేదాలు రెండూ ఆమెలో ముప్పిరిగొన్నాయి. పూర్వమూ చెప్పరానంతఏకాకిగా భావించుకొనేదేగాని యీనిమిషంలో అదేభావం తుది శ్రుతులకుచేరి పరాకాష్ఠ చెందింది. ఆమె హృదయం బరువెక్కింది, కాని వెలిబుచ్చలేదు, నిశ్శబ్దవ్యథార్తమైన ప్రకృతిమాత సన్నిధానంలో లోలోపల కుమిలే ఆ ఆడపడుచు తలవంచింది.

*   *   *

ఆమెకు వివాహం జరిపించడ మెలాగోనన్న దే
తల్లిదండ్రుల్ని వేపుకుతినసాగింది పిల్ల ఎదిగింది; ఈడేరిన
పిల్లనట్టింట బడివుండడంతో లోకం వారిని చీకొట్టింది. వెలివేస్తా
మని బెదిరించింది కూడా. వాణీకాంతుడు జరుగుబాటున్న
సంపన్నగృహస్థే. రెండుపూటలా చేపలవేపుడు రుచిచూడగల్గిన
కుటుంబమే. కలిమిగలవానిమీద అసూయ కావలసినంత. అది
లోకధర్మమే అందుచే అతనికి విరోధుల కొరతలేదు వొకనాడు
యిరుగు పొరుగు అమ్మలక్కలుపిల్ల పెళ్లినిగూర్చి కలగజేసు
కున్నారు. వాణీకాంతుడు ఊళ్లు వెడలిచెప్పులరగా తిరిగివచ్చాడు.
ఇక కలకత్తా వెళ్లకగాని వీలులేదన్నాడు.

కుటుంబం కుటుంబమంతా ప్రయాణమయింది. మంచుతెర
గప్పినఉషస్సులాగా సుభాహృదయం అశ్రుపూర్ణాకులమయింది.
ఇన్ని దినాలనుంచీ ఆమె బిక్కుబిక్కు మంటోంది. అలా పెన
గొన్న భయంతోనే తల్లిదండ్రులవెనక మూగజంతువులాగా వెన్న
విలి నడిచింది. వికచనయనాలతో వాళ్ళకళ్ళల్లోకి చూసింది. అలా
ఏదో తెలుసుకోవాలని వుద్దేశించింది. కాని వారు ఆమెకేమాటా
విప్పిచెప్పలేదు. ఇలా జరుగుతూండగా ఏకమధ్యాహ్నం గాలం
సవుపుతూ కూర్చున్న ప్రతాపుడిలా అన్నాడు: 'అయితే, సూ, నీకు
మొగుణ్ణిచూశారన్నమాట. నీకు పెళ్ళవుతుంది. నన్ను మరిచిపోకే'
అని గాలంఆడిస్తూ మళ్ళీ వేటలో నిమగ్నమయ్యాడు. 'నీకు నే చేసిన
అపచార మేముంది?' అని వుచ్చులో చిక్కినపావురం బోయవాని
మొగంజూచి దీనంగా అడుగుతుంది; అలాగే సుభా ప్రతాపుని
వేపు దీనంగా చూసింది. ఇక ఆరోజుకి చింతమాను క్రింద కూర్చో
లేక తిరిగొచ్చింది. వాణీకాంతుడు వొక్కకునుకుతీసి లేచి పడక
గదిలో పాలుకాక్కా పిలుస్తున్నాడు. ఇంతలో సుభావచ్చి అతని

కాళ్ళవద్ద పడి తండ్రి మొగంలోకి చూస్తూ గావురుమంది. వాణీ కాంతుడు వోదార్చబోయి తానే కంటతడి బెట్టసాగాడు.

ఉదయమే కలకత్తా ప్రయాణం నిశ్చయమయింది. పశు వుల కొట్టంలోని తన బాల్యస్నేహితులందరివద్దా సెలవు గైకొనేందుకు వెళ్లింది. చేతితో వాటికి పచ్చమేత అందించింది; వాటి మెడలు వాటేసుకుంది; కళ్ళల్లోకి చూసింది. ఆమె కళ్ళుబాష్పాలుకురిశాయి. బాష్పాలే ఆమె భాష గోచు మాణిక్యాలు అర్థంచేసుకున్నాయి. నాడు బహుళదశమిరాత్రి. సుభా గదివెడలివచ్చింది. పెటిగట్టున తాను కూర్చునే తావున గటికపట్టు మీద బోర్లాపడుకుంది. ఆతావు నామె ప్రేమించింది. భూదేవిని వాటేసుకొని పడుకుంది. భూదేవి ఆమెకు నిశ్శబ్ద, సుబలమాతృమూర్తి. 'నువ్వు నన్ను ఎడబాయనివ్వొద్దు, తల్లీ. నిన్ను నే కావులించుకున్నట్లే నువ్వూ నన్ను నీ గాఢ సమాలింగనంలో చిక్కబట్టుకో, తల్లీ!' అని నివేదించుకోవాలని యత్నించింది.

*　　*　　*

కలకత్తా మహానగరంలో ఏకయింట్లో ఏకానొకనాడు సుభాకు తల్లి శుభాలంకారాలు గైసేసింది. ఆమె కేశాల్ని బిగువుగా జడ అల్లింది. ఇన్ని ఆభరణాలు దిగవేసింది. ఆమెసహజ లావణ్యాన్ని చంపడానికి వలసినదంతా చేసింది, సుభా నీలలోచనాలు బాష్పపూర్ణాలయ్యాయి. ఏడ్చిఏడ్చి కళ్ళు వాస్తాయని తల్లి భయపడి కసురుకొని తిట్టింది. కాని కన్నీళ్ళు తిట్లకు వెరుస్తాయా ?

ఒక స్నేహితుణ్ణి వెంటబెట్టుకొని వరుడు పెళ్లిచూపులకువచ్చాడు. అలా యజ్ఞంలో బలిపశువును ఏర్చుకోడానికి దేవత

ప్రసన్నమైన ఆసమయంలో ఆమె తల్లిదండ్రులు భయసంభ్రమా లతో చకితులవుతున్నారు. తలుపువార నిలబడి, వరుడిముందరకు పంపేముందు కూతురికి తల్లి బిగ్గరగా సూచనలు యివ్వసాగింది. దానితో ఆమె యింకా వెక్కి వెక్కి ఏడవసాగింది. ఆ మహాపురు షుడు ఆమెను ఎగాదిగా పరీక్షగాచూసి 'అంత నాసిగాదు' అని స్వగతాన్ని పైకి అన్నాడు.

ఆమెబాష్పాలు అతనిమనసునాకర్షించాయి. ఆమెనుకోమల హృదయ అనుకొన్నాడు. జననీ జనకుల్ని ఎడబాయడానికి కుందుతున్న ఆమె ఆర్ద్రహృదయం తనకెంతో వుపకరిస్తుం దని వితర్కించుకుంటూ, ఏడుపును ఆమెసుగుణంగానే లెక్కగట్టు కున్నాడు. శుక్తిముత్యాల మాదిరిగానే బాష్పాలు ఆ బాలిక విలువను పెంచాయి. అతడంతకన్నా మరోవ్యాఖ్యానం చెయ్య లేదు.

*　　　*　　　*

పురోహితుడువచ్చాడు. శుభాశుభాలు లెక్కించాడు. ఒక శుభదినాన వివాహంపూర్తయింది. నోరులేని బిడ్డ నొకరిచేతుల్లో పెట్టి తల్లి దండ్రులు తమయిల్లుచేరారు. దేవునిదయవల్ల యిహంలో వారి కులానికి, పరంలో వారి భద్రతకు భంగం వాటిల్లకుండా తప్పింది. అల్లుడికి పశ్చిమ బెంగాల్‌లో వుద్యోగం అయింది. పెళ్ళయిన కొద్దిరోజులికి భార్యను కాపురానికి గొనిపోయాడు.

పట్టుమని పదినాళ్ళు గడవలేదు, పెళ్లికూతురు మూగదని అంతా కనిపెట్టారు. ఇంకా ఎవరైనా కనిపెట్టలేకపోతే, అది ఆవిడ తప్పుగాదు. ఇందులో ఆమెఎవ్వరినీ మోసగించలేదు. ఆమె గుట్టంతా కళ్లేవిప్పిచెప్పేశాయి; కాని ఎవ్వరూ అర్థంచేసుకోలేక

పోయారు. ఆమె మొకమొకాలూ చూసింది; ఎవ్వరూ పలక రించలేదు. జననమాది తెలిసి మెలగిన ఎరిగిన మొగాలిప్పుడు తనకు కరువయ్యాయి. మూగపిల్ల భాష నెరిగినవారంతా దూర మయ్యారు. ఆమె నీరవ హృదయం అంతమేలేని, వినబడని ఏడుపు చప్పుడులు నెలకొన్నాయి. అదెవ్వరికి తెలుసు అంతర్ద్రష్టకు తప్ప!



# దిక్కులేని దీనురాలు

ఉలాపురమని వొకవూరుంది. అంతాకలిస్తే అది కోడికూతపల్లె. కాని ఆ పల్లెపక్కన వొక నీలిమందు ఫ్యాక్టరీ వుంది. ఫ్యాక్టరీ యజమాని ఇంగ్లీషువాడు. అతని ప్రయత్నంవల్ల ఆ వూరిలో పోస్టాఫీసు తెరిచారు. కొత్తగా వుద్యోగంలో ప్రవేశించే వొకాయనకు ఆ పోస్టాఫీసుతోనే నౌఖరీ అరంభమయింది.

ఆయన స్వస్థలం అసలు కలకత్తా. పట్నవాసం మానుకొని యీమారుమూలపల్లె వాసానికి రావడంతో నీరొదిలి వొడ్డునబడ్డ చేపలా వుక్కిరిబిక్కిరయ్యాడు. ఆఫీసుకూ నివాసానికీ కలిపి వొక పూరిపాక వేయించి యిచ్చారు. అదొక చీకటికొట్టు. ఆ సమీపంలో కోనేరొకటుంది. చుట్టూ చెట్లు దట్టంగా పెరిగి, నీళ్ళు పసరెక్కి, గట్లు పాకుడుపట్టి వుంది ఆ కోనేరు.

నీలిమందు కంపెనీలో పనిచేసే కార్మికులకు క్షణం తీరికంటూ వుండదు. అయినా నాగరికులతోను, విద్యాధికులతోను వాళ్ళు స్నేహం చెయ్యదగ్గవారుకూడా గారు. కలకత్తాలో పుట్టిపెరిగిన యువకుల మాటందామా పొరుగువాణ్ణి పరిచయం చేసుకొని జతగలుపుకోడం ఎలాగూ చేతగాదు; పోనీ, కొత్తమొగం ఏదైనా కలవడం తటస్థ పడితేనో అందామా అప్పుడు గర్వంగా టెక్కుబోతాడు; లేదా చికాకుపడినట్లైనానటిస్తాడు.

ఇక వాళ్ళకి స్నేహితాలెలా దొరుకుతాయి? ఏదేమైనా మన కొత్త పోస్టుమాష్టారికి స్నేహితాలూ లేవు, చేతినిండా చెయ్యాదగ్గ పనీలేదు. అందుచే కాలంగడవడం కష్టమయిపోయింది.

ఏదో అప్పుడప్పుడు పద్యాలల్లుతూ కూర్చుంటాడు. పొదలో చిగురాకు కదిలినా, నింగిలో నీలి మబ్బులు నిండినా చాలు మానవుని జీవితం ఆనందంతో ఉప్పొంగుతుంది. ఆయన పద్యాలలోచెప్పే అనుభూతు లిటువంటివే. అరేబియన్ నైట్సు కథలలో వచ్చే భూతంవంటిదేదో దయదల్చి రాత్రికి రాత్రికి పూనుకొని చెట్లూ, పొదలూ ఆకులూ అన్నీ పెల్లగించి అవతల పారేసి, సొంపైన రాతిరస్తావేసి, మేఘమాల కనబడకుండా పెద్ద పెద్ద మేడలు మొలిపిస్తే....అదొక మహాప్రసాదంగావచ్చిన నవ్యజీవితం అనుకొని ఆ ఏకాకి పుప్పొంగి పోతాడని ఆ భగవంతునికి తప్పక తెలుసు.

మాష్టారుకు ముట్టేజీతం స్వల్పం. స్వయంపాకం చేసుకోవాల్సిందే. రతన్ అనే పిల్ల వొకతె వుంది. ఆపిల్ల చిరుతప్రాయంలోనే తల్లిదండ్రుల్ని కోల్పోయింది మాష్టారుకి చిల్లరపనులను చెయ్యడానికి చేతిక్రిందపిల్లగా వుంటోంది. ఆయన తన గాసుగలోదే గంపెడు. స్వయంపాకంలో ఆ పిల్లకో భాగం యివ్వాలి.

ఆ వూళ్లో సాయంకాలం హంగామాగా వుంటుంది. వంట యిళ్ళనుండి పొగవెలువడి ఆకాశంలో వలయాలుచుట్టుతుంది. ప్రతిపొదలోనూ పక్షులు కలకలారావాలుచేస్తూ వుంటాయి. బౌల్ మత శాఖకు చెందిన భిక్షువులంతా సైనికవిధిగా కూడి కీచురు గొంతుకల్తో ప్రార్థనలు జరుపుతారు. అప్పుడు వెదురుపొదల్లో చిగురాకు చిందుల్ని చూదామని వచ్చిన కవిగారి వెన్నుపూస

అదరి జలదరిస్తుంది. ఆసమయానికల్లా మాష్టారు దీపపు సెమ్మె ముట్టించి, రతన్ని పిలుస్తాడు.

ఆ పిలుపుకే ఎదురుచూస్తూ వాకిట్లో కాచివుంటుంది రత్నం, పిలువగానే వెళ్ళి ఎదట నిలబడదు. 'పిల్చారా'అని అడుగుతుంది. మొగట. అదొకనియమం తనకి.

'ఏం చేస్తున్నావు' ఎదురడుగుతాడు పోస్టుమాష్టారు.

'వెళ్ళి, పొయి రాజేయాలిగద బాబూ!' అని జవాబు.

'పొయిమాటకేంలే. నాపొగపైపుముట్టించిపో, ముందు' అని ఆర్డరవుతుంది.

అప్పుడు రత్నం లోపల ప్రవేశిస్తుంది. కాలుతున్న బొగ్గు తీసి, గట్టిగావూది పొగాకు అంటిస్తుంది ఆ పిల్లతో కబుర్లు వేసుకోడానికి అదే మంచిసావకాశం. "సరేగాని, రత్నం! మీఅమ్మ నీకు గుర్తేనా?" అని అడగడంతో కథ కదుల్తుంది. వాళ్ళిద్దరి మధ్యా సంభాషణకదలడానికి యీవిషయప్రసక్తి బాగుంటుంది. తల్లిసంగతులు రత్నానికిసగంగుర్తూ, సగంమరపూ. అమ్మకన్నా నాన్నే తనపట్ల ఆదరంగా వుండేవాడు. అందుచే వాళ్ళనాన్న విషయాలయితే సవివరంగా గుర్తున్నాయి. పని ముగించుకొన్న వెంటనేసాయంత్రానికి యింటికొచ్చేవాడు. అందులోనూవొకటి, రెండు సాయంత్రాలు బాగా గుర్తు. అవి చిత్రపటాల్లా మనసులో నిల్చిపోయాయి. జ్ఞాపకాలు ఏకధారగా స్ఫురించేసరికి వెళ్ళబోసుకోడానికని పోస్టుమాష్టారు కాళ్ళకు దగ్గిరలో కైటాం యిస్తుంది. చనిపోయిన చిట్టితమ్ముడు జ్ఞాపకం వస్తాడు.

మసుగువేసిన ఒకానొక రోజున వొక సీళ్ళకుంట పక్కన చెట్టు బెత్తంవిరిచి గాలం చువ్వగాకట్టి ఏవిధంగా ఆడు

కొన్నాళ్ళలో పూసగుచ్చినట్లు చెప్పుకొస్తుంది. అంత చిన్న ఘటనల వివరాలన్నీ గుర్తుంచుకొంటే, పెద్దవిషయాలు ఆ బుర్రలో నిలవడానికింకేమీ చోటు మిగల్లేదు. అందుచే చెప్పేవన్నీ స్వల్ప విషయాలే. ఇలాకబుర్లతో పొద్దుపోతూ వుంటుంది తరచు. అప్పుడు లేచి వంటచేసుకోవాలంటే మాష్టారు బద్ధకిస్తుంటాడు.ఆపళంగా రత్నం అదరా బదరా అగ్గిచేస్తుంది. నిలవరొట్టెతీసి, ముక్కలుగా కోసి పొయ్యిసెగమీద వెచ్చగిల బెడుతుంది. పొద్దుటిపూట మిగిలిన చద్దివేమైనా వుంటే అందులో నంజుకుతిని చెయ్యికడుక్కుని చక్కా నిద్రపోతారు.

తల్లిదండ్రుల్ని కోల్పోయి ఏకాకి అయింబాపిల్ల - తల్లిదండ్రులుండీ ఏకాకయ్యాడు పోస్టుమాష్టరు. చచ్చిపోయిన వాళ్ళని ఆపిల్ల జ్ఞాపకం చేసుకొంటే, బ్రతికివుండి దూరమైపోయిన అప్పుల్ని తానూ తల్చుకోగలడు. ఆ పూరిపాకలో ఓ మూల ఏకాంతంగా వ్రాతబల్లముందు కూర్చుని ఓకసాయంకాలం తినయిల్లు, అమ్మా, చెల్లీ యింకా యితర బంధుమిత్రుల్నీ జ్ఞాపకం చేసుకోసాగాడు. ఆ జ్ఞాపకాలు విడవకుండా వెన్నాడుతున్నాయి. ఇటువంటి విషయాల్ని మిల్లు గుమాస్తాలముందు ఏమని వెళ్ళబోసుకోగలడు? అది అతనివల్ల కానిపని. అందుకు తగిపోయిన గొప్ప అప్పురాలు చెంతేవుంది. ఆ బాలికను ముందు పెట్టుకొని అతి సహజంగా అన్నీ జ్ఞాపకం తెచ్చుకొని బిగ్గరగా ఆలోచించుకొంటూ వుంటాడు. అలా అనేక పర్యాయాలు యింటిల్లపాదీ అందర్నీ గూర్చి అన్ని విషయాలూ అనుకొనేవాడు. అందువల్ల ఆపిల్లకూడా అమ్మ, అక్క, అన్న అంటూ వాళ్ళనెంతో కాలంగా తానెరిగినట్లే పేరుపేరునా మాట్లాడ

గగ్లేది. మాష్టరుగారిబంధువుల్లో ప్రతివొక్కరిని గూర్చి ఆబాలిక మనస్సులో శిలాక్షరాలుగా మిగిలి పోయాయంటే అబద్ధం కాదు.

ఒకరోజు మధ్యాహ్నం కుండపోతగా కురిసేవర్షం వెలిసింది. వెచ్చని పిల్లగాలి హాయిగా వీచింది. తడిసిన పచ్చికా, తరుపత్రాలు తమ సువాసనను చండభానుని కాంతిలో అలసట చెందిన భూదేవి విడిచిన వెచ్చని నిశ్వాసమా అన్నట్లుగా వ్యాపింపజేశాయి. ఆ మధ్యాహ్నమంతా పొదలో వొకపక్షి విధివిరామం లేకుండా ఎలుగించి ఏడుస్తోంది.

పోస్టుమాష్టారుకు పనేమీలేదు. రికామిగా వున్నాడు. వానలో తలంటు పోసుకొన్న చిగురాకుల చిందులూ, వెనుదిరిగి వెళ్ళిపోతున్న తెల్లమబ్బుతునకల ప్రోవులూ గమనించదగ్గ దృశ్యాలుగా వున్నాయి. పోస్టుమాష్టారు ఆకాశంలోకి తలెత్తి అవలోకిస్తున్నాడు. లోలోపల ఆలోచిస్తున్నాడు. "అహో! ప్రియురాలే చెంతనుంటే!- నా హృదయానికి హత్తుకోగల వొక మానవప్రాణమే నాతోవుంటే!"....ఇలా అదేపనిగా ఆలోచిస్తున్నాడు. ఎలుగెత్తే ఆపిట్ట చెప్పేదీ, ప్రతి కదలికలో చిగురాకు వ్యక్తపరచబోయేదీ యీ అనుభవాన్నే నను కొంటాడు. జరుగుబాటులేని జీతంరాళ్ళతో కాలక్షేపం గావించే పల్లెటూరి పోస్టుమాష్టరు మనసులో మధ్యాహ్న విరామంలో వేపుకునే భావం యిదని గ్రహించే వారుండరు: విని విశ్వసించే వారూ వుండరు. పాపం!

మాష్టారు నిట్టూర్చాడు. రత్నం అని పిల్చాడు. చెట్టునీడన బోర్లా పడుకొని చేతికందిన రాలినపళ్ళు పరుకొని చప్పరిస్తోంది. పిలవగానే పరుగెత్తుకు పోయింది. గుమ్మంలో నిలబడి

"దాదా! పిల్చావా?" అని అడిగింది, 'రా, లోపలికి, చదువు చెప్తాతా. నేర్చుకుందిగాని.' అన్నాడు మాష్టారు. ఆ బాలికకు అక్షరాభ్యాసానికి ఆమిట్టమధ్యాహ్నమే ముహూర్తమన్నాడు; దిద్దించాడు.

కాసేపటిలో రత్నం గుడింతాల దగ్గరకొచ్చేసింది.

వర్షాలికతగ్గేనా అనిపించాయి. కాలవలు, పడియలు, పల్లాలు వరద మయమయ్యాయి. రేయింబవళ్ళు వానచప్పుళ్లే విన్నారు,కప్పలుబెకబెకలే విన్నారుప్రజ. వూరివీధులు వూబులై వూరుకున్నాయి. జనం కదలికలు కష్టంగావుంది.

ఉదయం మసుగు వేసివుంది. పోస్టుమాష్టారి చిట్టిశిష్యురాలు ఆయనపిలుపుకోసం గమిడీగాచివుంది. ఎంతసేపటికీ పిలుపు రాలేదు. ఏమిటో తెలియులేదు వేగిరపడింది. కుక్కచెవిలా నలిగి వేలాడే పుస్తకం పట్టుకొని మెమ్మదిగా గదిలో ప్రవేశించింది. పంతులుగారు మంచం మీదేవున్నారు. ఆయనకింకా నిద్రకావాలికాబోలు ననుకొంది. అందుచేత బొటనవేలుమీద పిల్లిఅడుగులువేసుకుంటూ వెనక్కుతిరిగి పోబోతోంది. 'రత్నం,' అనివినపడింది. వెంటనే తిరిగింది. 'దాదా! నిద్రపోతున్నావా?' అడిగింది. "వంట్లోబాగులేదు, నుదుటిమీద చెయ్యేసిచూడు, బాగా వేడిగావుందేమో!" అని హీనస్వరంతో అన్నాడుమాష్టరు.

ప్రవాసంలో వొంటరిగావుంటూ,అందులో వర్షాలసజ్జులో -తగిన వుపచారాలు, ప్రక్రియలూ పొందాలసలు. మృదువుగానుదుటమీద నిమిరేచెయ్యి గాజులచిరు సవ్వడి వినాలని కోర్కె కలిగింది. ప్రియురాలు చేరువను కాంక్షించాడు. తల్లి, తోబుట్టువుల వాత్సల్యాన్ని అనుభవించ గోరాడు.

ఈ ప్రవాసం అంతనిరాశామయంగాదు. ఇక్కడా జాలిగుండెలున్నాయి. రత్నం ఏమీ ఎరగని పసిగుడ్డులా వుండదలచలేదు. మాతృమూర్తిగామారింది. గ్రామవైద్యుణ్ణి పిల్చితీసుకొచ్చింది. ఆయనచెప్పినట్లు ఆయాగడియల్లో ఆయామందులు వాడగల్గింది. రేయింతా జాగరణంచేసి తలగడాదగ్గరేకూర్చొని వుంది. "కొంచెం తేరుకుంటున్నట్టులేదా, దాదా!" అంటూ అప్పుడప్పుడూ అడిగేది.

.... .... .... ....

మంచంఅంటు పూర్తిగా వదలలేదు; నిస్సత్తువ తీరలేదొక ప్రక్కన. 'ఇంకలాభంలేదు, నేనిక్కడనుండి బదలీ కోరతాను, ఏమైనాసరే!' అనుకొన్నాడు నిశ్చయ పూర్వకంగా. బదలీ చెయ్యవలసిందిగా తక్షణమే అధికార్ల వద్దకు అర్జీ వ్రాసి పంపాడు. స్థలం ఆరోగ్యపుయింది గాదని, వాతావరణం తనకు పడలేదని కారణాలు చూపాడు.

రత్నం దాదిగా వుపచరణ విధులు చెయ్యడం పూర్తయిపోయింది. ఇక అవసరం లేకపోయింది. మళ్ళీ యథావిధిగా గుమ్మంలో కూర్చొనేది. కాని ఎంతసేపు కాచుకు కూర్చున్నా పూర్వంమాదిరిగా పిలుపురావడం మానేసింది దానితో గదిలోకి తరచుగా తొంగి చూస్తుండేది పోస్టుమాస్టరు కుర్చీలో కూర్చొని వుండేవాడు. తప్పితే పరుపుమీద పరుండి వుండేవాడు. అంతగా కాకుంటే పరధ్యానంగా ఆకాశంలోకి చూస్తూ ఆలోచిస్తూ వుండేవాడు.

తన పిలుపుకోసం రత్నం ఎదురు చూస్తోంది. తన అర్జీ జవాబుకోసం తానెదురు చూస్తున్నాడు. అయ్యవారు పాఠాలు

చెప్పడం మానేశారు. అయినా పిల్లలో శ్రద్ధ చావలేదు. పాత పాఠాలు వల్లెవేస్తోంది. గురుదేవులు మళ్ళీ అనుగ్రహించేలోగా నేర్చుకున్న గుణింతాలు కూకిపోతాయేమోనని ఆవిడ భయం. ఆవిధంగా మౌనంలో వారం జరిగింది. ఎట్టకేలకొక సాయంత్రాన అయ్యవారి పిలుపాలకించింది. సంతోషాని కంతులేదు. గెంతి గదిలో వాలింది. అలవాటుకు విరుద్ధంగా ఎదుటబడ్డాక అంది, 'దాదా, పిల్చావా' అని యథాప్రకారంగా.

"రత్నం, రేపు వెళ్ళిపోతున్నాను" చెప్పాడు పోస్టు మాష్టరు.

"దాదా ! ఎక్కడికి."

"మా యింటికి ...."

"మళ్ళీ ఎప్పుడు తిరిగొస్తావు, దాదా !"

"మళ్ళీరాను."

ఆపైన అడగడం మానేసింది రత్నం పోస్టుమాష్టరే కల్పించుకొని చెప్పకొచ్చాడు. బదలీ అర్జీ అంగీకరించబడలేదు. వుద్యోగానికి రాజీనామా దాఖలుచేసి యింటికి బోతున్నాను అన్నాడు.

ఇద్దరిమధ్యా మాటలు యింకా జరగలేదు. మౌనంగా చాలసేపు జరిగిపోయింది దీపం కొండగట్టింది ఒకమూల యింటి పైకప్పులో చిల్లు పడింది. వాన నీళ్ళుదిగి యింట్లోపుంటి కడపలో కురవడం మొదలెట్టింది.

మరికొంచెం తడవు గడచింది. అన్నం వండడానికి వంటింట్లోకి వెళ్ళింది రత్నం. కాని వెనకటంత హుషారుగా

వంట సాగించలేక పోతోంది. ఆమె చిన్నబుర్రలో అనేక కొత్తవిషయాలు ఆలోచన కొచ్చాయి. పోస్టుమాస్టరు రాత్రి భోజనం చేశాడు. బాలిక హఠాత్తుగా ప్రశ్నించింది. "నన్ను తీసికెళ్ళవు, దాదా!"

మెల్లగా నవ్వుకున్నాడు. అన్నాడు 'ఏమి భావం!' అని. అంతటితో వూరుకున్నాడు. తీసికెళ్తే రాగల చిక్కేమిటో చెప్పాడు గాడు.

ఆరాత్రి నిద్రలోను, మెలకువలోనూ ఆ పిల్లకదే ధ్యాస. 'ఏమి భావం' అని నవ్వుతూ ముక్తసరిగా ఆ అనిన్న మాటలే మళ్ళీమళ్ళీ వేధించాయి పిల్లని.

పోస్టుమాస్టరు పెందరాళే లేచాడు. రత్నం అప్పటికే స్నానానికి నీళ్ళుపెట్టి వుంచింది నీళ్ళు కుండలోపట్టి స్నానం చేయడం కలకత్తా పద్ధతి. ఆ అలవాటాయన మానుకోలేదు. ఏట్లో మునిగిరావడం పల్లెటూరి స్నానం. ఏకారణం చేతగానీ, ఆయన ప్రయాణ మెప్పుడో రత్నం అడగలేదు. కాని జాగ్రత్త కోసం వేకువనే లేచి నదికెళ్లి నీళ్లు తెచ్చింది. ఆయన అడిగేసరి కల్లా అలా సిద్ధంగా వుంచదలచింది. ఆయన స్నానంచేసి రత్నాన్ని పిల్చాడు. మారుమాట లేకుండా నిశ్శబ్దంగా వెళ్లి ఎదట నిలబడింది. ఏమి చెబుతాడో అని ఆతురతతో ఆయన మొఖంలోకి చూస్తోంది "నే వెళ్తున్నందుకు బెంగ పెట్టుకోవద్దు. నిన్ను కనిపెట్టి చూడమని వచ్చే ఆయనతో చెప్తాలే." అన్నాడు. దయకొలదీ అన్నమాటలే అయినా. సందేహంలేదు. కాని ఆడపడుచుని మనోరీతులు చెప్పజాలనివి!

యజమాని ఎన్ని తిట్టినా పడింది; దిగమింగింది; భరించింది. కాని యీ జాలిమాటలు భరించశక్యంగా లేదు. వెక్కివెక్కి ఏడ్చింది. కడకు ఇలాఅంది!" నన్ను గురించి ఎవరికీ ఏమీ చెప్పనక్కర్లేదు. నేనిక్కడ వుండనే వుండను."

పోస్టుమాస్టరు చకితుడై పోయాడు. రత్నం ఏడవడం ఎప్పుడూ ఎరగడాయన.

సమయానికి కొత్తమాస్టరు వచ్చాడు. పాతమాస్టరు బాధ్యత అప్పగించాడు. ప్రయాణానికి సిద్ధమయ్యాడు సర్దుకున్నాడు. బయల్దేరబోతూ రత్నాన్ని పిలిచాడు. "ఇదిగో! ఇది తీసుకో! కొంచెమే. కొన్నాళ్లు గడుస్తుంది నీకు" అంటూ ప్రయాణానికి బొటాబొటిగా సరిపోయేంత మిగుల్చుకొని, తక్కిన నెల జీతం జేబులో నుంచి తీసి యివ్వబోయాడు; ఇవ్వడం చూసీ చూడ్డంతోటే రత్నం చెంగున ఆయన పాదాలచెంత వ్రాలింది. "దాదా, నా కేమీ యివ్వొద్దు. నాకసలొద్దు. నన్నుగూర్చి బాధపడొద్దు" అని నిక్కచ్చిగా చెప్పేసింది. ఏడుపు దిగమింగి చెప్పి లేచి నుంచోలేదు. మళ్ళీ కనిపించకుండా రివ్వున పిట్టలా పరుగెత్తి మాయమయ్యింది.

చేసేదిలేక పోస్టుమాస్టరు నిట్టూర్చాడు. సంచి చేతిలోకి తీసుకున్నాడు. గొడుగు భుజంమీద పెట్టుకున్నాడు. రంగుల ట్రంకుపెట్టె తలమీది కెత్తుకుని వొక మోతమనిషి దోవతీశాడు. పడవలరేవుకు చేరారు.

మాస్టరు పడవెక్కి కూర్చున్నాడు. భూమిలోవుంచి ఉబికే కన్నీళ్ళ సెలయేరులాగా వర్షాలకు పొంగి పొరలెత్తిన నది పడవకొనలవద్ద సుళ్లు దిరిగింది; ఏడ్చింది. అదృశ్యాన్ని చూసే

సరికతనిలో విచారం అలమింది. తాను జూస్తున్న భూమాత అవ్యక్తశోకానికి నకలుగా వున్న ఆ పల్లెటూరు పేదపిల్ల దీన వదనం ఎదురుగుండా చూసినట్టయ్యింది. అదే పదేపదే ఆలోచిస్తున్నాడు. భావావేశం కలిగింది. ఒకానొక క్షణంలో పడవ దిగి వెళ్ళిపోదామనిపించింది. ఏకాకిగా ఏకారే ఆ దిక్కులేని పక్షిని పట్టుకొని కూడా తీసికెళ్ధామని కలిగింది. ఈ జాలిభావం చాలా ఆలస్యంగా కలిగింది. సమయం దాటపోయింది. అలవి తప్పింది పడవ తెరచాపలు విప్పారు. గాలితో నిండాయి. పడవ కదిలింది. పరవళ్ళుతోలే ఏటి నడిసీట్లో పడవ ప్రవేశించింది. తీరం దూరమయింది. ఉలాపురం వూరు వెనకాల దిగడింది. వూరి వెల పల వల్లకాడు దర్శనమిచ్చింది.

వడిగా పరుగెత్తే నడిఏట నావలో వున్న ప్రయాణీకుడు భావావేగాన్ని నిగ్రహించుకోదలంచాడు. శాస్త్ర వేదాంతం చెప్పుకొని తన్నుతాను వూరార్చుకున్నాడు. 'ప్రపంచం ఒక ధర్మసత్రం. బ్రతికి వున్నంతసేపే ఆ సత్రంలో కలుసుకుంటాం. ఈ జంజాటం యింతవరకే చావుపిమ్మట యీసమస్యలు లేవు. మళ్ళీ తిరిగి రావటం వుండదుగదా!' అనుకొన్నాడు.

పాపం, రత్నం వూరడిల్లే మార్గం ఏమిటి? ఆ పసికందుకు ఏమి తెలుసును వేదాంతం? కళ్ళనీళ్ళు కడవలు గడుతూ పోస్టాఫీసు చుట్టూ పక్షిలా తిరుగాడుతోంది. ఇంకా దాదా తిరిగొస్తాడనే ఆశ ఏమూలో మెదుల్తోంది గాబోలు, అందుకే ఆ తావుతో బంధం తెంచుకోలేక పోతోంది. ఓహో! మానవుని నైజమెంత విమూఢం! కోర్కెకోలదీ చేసే తప్పులు అంటు వద

లవుగదా! హేతుబుద్ధియొక్క మాట చెల్లడానికి ఎంతకాలం పడుతుంది? ఈ లోగా అదెంత గొప్ప నిదర్శనాలను చూపినా మన నమ్మకాలు సడలవు. ఏదో అడియాసకై ఎంత పట్టుకొని వ్రేలాడతామో! కడకేదో వొకదినం వస్తుంది. ఆశాహృదయం శూన్యమవుతుంది. ఆబంధాలక్కడ, అప్పటికి తెగుతాయి. కొరగాని ఆస తన యిల్లు ఖాళీచేసి వెళ్లిపోతుంది. ఆ తర్వాత జ్ఞానోదయం కలిగి దుఃఖిస్తాం. కాని మళ్ళీ అవే తప్పుల్లో తగుల్కొని వుక్కిరి బిక్కిరి కావాలనుకొనే కోరిక పురుగులా చిత్తాన్ని తొలుస్తూనేవుంటుంది.



# చనువిస్తే చంకెక్కిన నీలకంఠుడు

సాయంత్రసమయ్యే కొలదీ తుఫాను తీవ్రత పెరగింది. ధారాపాతంగా వర్షం కురవసాగి - ఫెళఫెళమని వురుములు - తళతళమని మిరుమిట్లు గొలిపే మెరుపులు తరచవ్వడం గమనిస్తే ఆకాశంలో దేవదానవ సంగ్రామం చెలరేగుతున్నట్లుగా భావించుకోవచ్చు. కమ్మిన కారుమబ్బులు విధిదేవత విజయ కేతనాలవలె కదలాడాయి. గంగాభవానికి వరదకోపం కమ్మింది. ఇరుగట్లావున్న తోపుల్లోని చెట్లు వాయువీవనలకు నిట్టూరుస్తూ, మూలుగుతూ, విరిగిపడుతూ ఎడాపెడా వూపేయబడుతున్నాయి.

చంద్రనగరం గంగాతీరంలో వుంది. ఆవూళ్లో ఆ నది కట్టమీది యిళ్ళల్లో తలుపులు బిడాయించుకున్న వొకగదిలో నేలమీద పరచిన పరుపుమీద పడుచు దంపతుల జత వొకటి కూర్చొని వొకానొక జటిల సమస్యని మనసా చర్చిస్తున్నారు. ప్రక్కనే మట్టిదివ్వె మండుతోంది.

పెనిమిటి శరత్తు - యువకుడు. 'ఇక్కడే మరికొన్నాళ్ళ పాటు నువ్వుండాలని నావుద్దేశం. బలం చిక్కాక యింటికి రావచ్చు.'

భార్య కిరణ్, "పూర్తిగా కోలుకున్నాను. ఇప్పుడే వచ్చేస్తే ప్రమాదమేమీ ముంచుకురాదనే భావిస్తాను."

దాంపత్య జీవితం రుచిచూచిన ప్రపౌఢ మహాశయు
డైనా నేచెప్పినంత టూకీగా యీ సంభాషణ ముగిసి వుండదని
విషయాన్నిబట్టి యిట్టే గ్రహిస్తాడు. విషయమంత క్లిష్టమయిందీ
కాదు - అయినా వారిద్దరమధ్యా నడిచే వాద ప్రతివాదనా
సరళివల్ల విషయం వొక కొలిక్కి రాలేదు. చుక్కానిలేని పడవ
మాదిరిగా చర్చ వొకేవొక్క బ్రహ్మాండంచుట్టూ సుడ తిరుగుతోంది.
కడకు శ్రుతిమించి కన్నీటివరద పర్యంతమయింది.

"మరి కొద్దిరోజులు వుండాలనే డాక్టరుగారి అభిప్రాయం"
అన్నాడు శరత్.

"డాక్టరుగారొక సర్వజ్ఞులు-అన్నీ ఆయనకే తెలుస్తాయి"
కిరణ్ అంది.

"దేశంమీద అన్నీ జబ్బులే, తెలుసా ? ఒకటి రెండు
మాసాలు యిక్కడ వుంటేనే నయం." అన్నాడు శరత్.

"అయితే, యిక్కడ వున్నవాళ్లే కాబోలు అంత ఆరో
గ్యవంతులై వుంటున్నారు." అని కిరణ్ చమత్కారం.

ఇంతకూ విషయం యిది. కిరణ్ అంటే యింట్లోను,
యిరుగు పొరుగులోను గొప్ప అభిమానం. అంతా ఎందుకూ,
ఆమె ఖాయిలా పడిందనే సరికి వాడకట్టంతా ఆందోళన
చెందింది. కాని ఆపూరి ఛాందసపు వ్యవహర్తల ధోరణి మాత్రం
వేరుగా వుంది. గాలిపాటు మారితే దానంతట కదే కుదిరే
రోగానికి - అందులో పెళ్లాన్ని గూర్చి-ఇంత హంగామా చెయ్య
డానికి మొగుడెంత లజ్జమాలిన మనిషయ్యాడో అనుకున్నారు.
ఉండబట్టలేక మొగానే అడిగేశారు. "ఇంతకుపూర్వం ఏయిల్లాలికీ

రోగమే రాలేదనుకుంటున్నావటయ్యా? మీరు ఆమెణ్ణి తీసుకువెళ్దా మనుకొనే తావునచావులేనిజనంనివసిస్తున్నారనితలుస్తున్నావా? అక్కడికివెళ్తే నొసటివ్రాలు చెల్లడం తప్పిపోతుందా, ఏమిటి?"
శరత్తూ, తల్లీ యీ మాటలేమీ లక్ష్యపెట్టలేదు. పూరివుమ్మడి తెలివికన్నా వాళ్ళ గారాలకూచి 'అల్పసిరి' జీవితానికి వాళ్ళు ప్రాధాన్యం యిస్తారు. అప్తులకు ఆపద కల్గవచ్చునుకుంటే విచ క్షణనీ, హేతుదృష్టినీ విడనాడడం లోకసైజం. అందుకే శరత్తు చంద్రనగరం వెళ్ళవలసి వచ్చింది. కిరణ్ జబ్బు నయమయింది. అయినా యింకా బలహీనంగా వుంది. ఇంకా ఆమెముఖంలో పీడకళ వదల్లేదు. అందుచేత ఆమెను చూస్తేంటే జాలిగొలుపు తోంది. ఎంతలో చావుతప్పి బ్రతికిందా అనేభావం చూపరులకు వెంటనే కలుగుతుంది.

కిరణ్ సావాసం కోరిన జీవం. సందడి, వేడుకలకాసిం చిన ప్రాణం. నదిగట్టున భవనంలో దాపురించిన ఏకాంతవాసం ఆమె రుచులకి సరిపడిందికాదు. చెయ్యడానికా పనిలేదు-పిచ్చా పాటీ కబుర్లకా తగిన యిరుగుపొరుగూ లేదు. పొద్దస్తమానం మందులు, మోతాదులు - పథ్యాలతో గడపాలంటే ఆమెకు చెడ్డ అసహ్యాం. మోతాదులు కొలవటంలోను, కాపులు వేసు కోవడంలోను వుండే వుత్సాహమేమిటి ? తుఫాను పట్టిన ఆ అపాయ కాలమప్పుడు తలుపులు మూసుకొని చర్చించిన విషయం యిదే.

కిరణ్ దయచేసి చర్చించినంతసేపూ. వాదం చక్కని పాకంలో సాగేది. జవాబు చెప్పడం మానినా, చేసేది లేద న్నట్లు తల పంకించి మరోవేపుకు చూపు మరల్చినా, పాపం

మానవుడికి తోచేదికాదు. ఆ పైని వేగలేక 'సరే, నీయిష్టమే కానివ్వు' అనబోయే స్థితికి వచ్చేశాడు. ఆ మాట నోటిమీద కొచ్చేసరికి తలుపు తట్టింది పనికత్తె.

శరత్ తలుపు తీశాడు. తుఫానులో చిక్కి నదిలో నావొకటి మునిగిపోయిందని, ఆ ప్రమాదంలోనుంచి బ్రాహ్మణ బాలుడొకడు యీదుకుంటూ తమ పెరటి మెట్లదగ్గర తేలి దరి జేరుకోగలిగాడనీ సమాచారం అలకించాడు.

ఆ వుదంతంతో కిరణ్ నిలువునా కరగిపోయింది ఆ కుర్రవాడికని పొడిబట్టలు వెదక నారంభించింది యింట్లో. గ్లాసుడు పాలు వేడిచేసి తెచ్చి, ఆ కుర్రవాణ్ణి తన గదిలోకి పిలిపించుకొంది.

వుంగరాలు దిరిగి పొడవుగా ఎదిగిన జుత్తు - భావప్రకటనా వైశద్యం గల విశాలనేత్రాలు-గడ్డము. మీసాలు యింకా ఎదిగే సూచనలా లేవు.... వాడు పాలు ఒక గుక్క వేసిందిలగా యతూ మంచి చెడ్డల విచారణ ఆరంభించింది.

పేరు నీలకంఠం. ఒక నాటక సమాజం తాలూకు మనిషి. ఆ దాపులోవున్న నాటకశాలలో ప్రదర్శనయివ్వడానికని వాళ్ళ సమాజమంతా బయల్దేరింది. హఠాత్తుగా మార్గమధ్యంలో నదిలో తుఫానుకు చిక్కి నావ తల్లక్రిందులైంది. తోడివాళ్ళకేమి జరిగిందో అతనికేమీ తెలియదు. వీడు మాత్రం గజయీతగాడు. అందుకే వొడ్డందుకొని ప్రాణాలు కాపాడుకోగల్గాడు.

* * *

ఆ కుర్రవాడు అలాగే ఆ యింట్లో అతుక్కుపోయాడు. వాడూ తనకుమల్లే చచ్చి బ్రతికినందున సహజంగా కిరణ్ వాడిని

గూర్చి గట్టిగా శ్రద్ధ వహించింది. అప్పటి ఆ పరిస్థితికి ఆ కుర్రవాడి రాక ఎంతో శ్రేయోదాయకమైనదిగానే శరత్ కూడా భావించాడు. ఏమంటే కిరణ్ ఏకాకిగా గడపలేదని ముందే విన్నవించాను. ఇప్పుడీ కుర్రవాడితో ఉల్లాసంగా కాలక్షేపం జరుగుతుంది కిరణ్ కి. ఆ మిషమీద ఆమె నిక్కడే మరికొంత కాలం వుంచడానికి అవకాశం చిక్కుతుంది. అలాగని వొప్పించవచ్చు. కిరణ్ కరుణాస్వభావంవల్ల యీ బ్రాహ్మణాతిథి లాభం పొందినప్పటికీ, అదంతా కోడలి బాగుకే తోడ్పడుతుందని అత్తగారు సైతం యీ ఆగంతుకుని రాకకు హర్షించింది. ఇక నీలకంఠం సంగతి చెప్పేదేముంది? తిన్నితే నూది పరుపు మీద పడినట్లయింది. అటుపాతయజమానికొలువూతప్పింది; ఇటు పరలోకప్రాప్తీ తప్పింది. ఇలా దెబ్బతో రెండు ప్రమాదాలను తప్పించుకున్నందు కెంతో సంతోష పడ్డాడు నీలకంఠుడు ఆపైన స్థితిపరుల యింట ఆదరణ లభించింది.

ఎన్నో నాళ్లు కాలేదు. శరత్తూ, తల్లీ కుర్రవాడి యెడ అభిప్రాయాలు మార్చుకొన్నారు. వాడంటే యిన్నాళ్ళటి యింపు తగ్గింది. ఎప్పుడు వొదిలిపోతాడా పీడ అని కోరుకో సాగారు. చాటున శరత్ హలుకా పిల్చడం మరిగాడు నీలకంఠం. కుండపోతగా వర్షం కురుస్తోంటే శరత్ పట్టుగోడుగు కాస్తా లంకించుకొని టింగురంగా అని వూరంతా చెక్కర్లుగొట్టి, ఎదురైన మొకాన్ని నిలవేసి నేస్తాలు కట్టుకొస్తున్నాడు. తనకుతోడు—వొకుక్కపిల్లని మచ్చిక జేశాడు. అతిముద్దు జేశాడు. చనవిస్తే చంక కెక్కినట్లుగా, అది బురదకాళ్ళతో యింట్లో చొరబడడంతోటే ఆగక మల్లెపూవువంటిశరత్ పరుపుమీదే ఎక్కేది

'నే వచ్చి వెళ్ళాను, సుమా! తెల్సుకో' అన్నట్లుగా కాళ్ళ ముఠికి గుర్తులు పరుపుమీద ముద్రించి వెళుతుండేది. నానా ఖాపతుల్నీ, నానాకారుల్నీ వూరి కుర్రజట్టునంతా చేరదీసి వొక రామదండు తయారుజేశాడు. ఈ రామదండు నిర్మాణం ఫలితంగా ఆ దరిదాపుల్లో లెక్కకొక్క మామిడి పండైనాగాని దోరముగ్గే అదృష్టానికి ఆ పడాదికి నోచలేదు. వీడి చేష్టల విపరిణామం యిలా వుంది.

కుర్రచాడి చెడుపోకలకు కిరణ్ బాధ్యతకూడా వుందనడంలో ఎట్టి సందేహమూ లేదు. ఆ విషయమై శరత్ ఆమెనెన్నో పర్యాయాలు మందలించాడు. ఆ మందలింపు లామె చెవులకు పట్టలేదు. శరత్ తీసివేసిన పంచెలు, కమీజులు వాడికి కట్టబెట్టి అలంకారాలు చేసేది. కొత్తబట్టలు యిచ్చిన వైనాలూ కద్దు. వాడంటె ఎంటుకో బంధం పెంచుకొంది. వాడి వృత్తాంతం యింకా యింకా తెల్సుకోవాలని కుతూహలం చూపింది. అందుకే వాణ్ణి నిత్యమూ తన గదిలోకి పిలిపించుకొంటూండేది. స్నానంచేసి మధ్యాహ్నం భోజనం గావించి, పట్టెమంచం పరుపుమీద తాను కూర్చొని ప్రక్కన తాంబూల పేటికను తెరచి పెట్టుకోగా పనికత్తె తల దువ్వి కురులు తడియార్చుతూ వుంటె - కట్టెదుట నీలకంఠుడు నిలబడి గేయకీర్తనలు ఆలపిస్తుంటాడు. భావాని కనురూపమైన అభినయంకూడా పాటతో జోడిస్తాడు. గిరజాలు, జుల్ఫాలు ఎగురుతూ పడుతూవుంటాయి. పొద్దుజరగని మధ్యాహ్న యామాలు కిరణ్‌కు యిలా గడిచిపోతూంటాయి. తన వినోదం గాక, శరత్‌ని కూడా వచ్చి కూర్చొని వినోదం చూడమని బలవంతం చేస్తుందిగాని, శరత్ నిరాకరిస్తూ వచ్చేవాడు. కుర్రవాడంటే శరత్‌కు అసహ్యాశా

భావం ఏర్పడింది ఒకవేళ శరత్ వచ్చి కూర్చున్నా, నీలకంఠుడు ఎప్పటి అభినయంలో సగమైనా చెయ్యజాలకపోతాడు. వాడు పాడే గేయకీర్తనల్లో భగవన్నామావళి అయినా తగుల్తుందనే ఆశతో అప్పుడప్పుడు శరత్ తల్లి ఆ గానాబజానాకు హాజరవుతుంటుంది. కాని మధ్యాహ్న భోజనానంతర నిద్రమీద గల అపేక్షా అభిరుచీ కాస్తా అడ్డంవచ్చి ఆమె భక్తిని అడుక్కు తొక్కేస్తుండేవి. అంతలోనే కునికిపాటులో-కలవరింతలు సాగేవి.

కుర్రవాడి కప్పుడప్పుడూ గూబలు మెలబెట్టి, ఎక్కువే నీరుములు అందుతున్నాయి. అయినా, నాటక సమాజంలో అల వాటుపడ్డ దాసిముండదొక లెక్కాగాదు ఈ చెవిశిక్ష కందుకే అఘటం లక్ష్యంపెట్టలేదు వాడికున్న కొద్దిపాటి ప్రపంచానుభవంలో వాడొక నిశ్చయానికి వచ్చాడు. నీరూ, నేలా గలిసి భూమి అయిన చందంగానే, మెప్పులూ తాపులూ కలిస్తేనే మానవ జీవితం కాగల్గుతుందని తీర్మానం చేసుకున్నాడు. రెండింటిలో మళ్ళీ తాపులపాలే అధికం అని భావించాడు.

నీలకంఠం వయస్సు చెప్పుకోవడం కష్టం. పధ్నాలుగు, పదిహేనేళ్ళని అనుకొంటే, ముఖవర్చస్సు ఆవయస్సును మీరిన దవుతుంది. పదిహేడు, పద్దెనిమిదనుకొంటే ఆవయస్సుకదిబాగా లేతమొకం అనిపిస్తుంది. అంటే కావలసినంతకంటే ముందే వయోజను డయ్యాడనో, లేకపోతే బాలకుడుగా బహుకాలం గిడసబారిపోయి వున్నాడనో దీన్నిబట్టి భావించాల్సివస్తుంది. ఇంతకూదీనికి కారణమేమంటే, నీలకంఠుడు బాగాశైశవంలోనే నాటక సమాజంలో చేరి, రాధిక, దమయంతి, సీత వంటి స్త్రీ పాత్రలు ధరిస్తూ వచ్చాడు. లెక్కప్రకారమూ అన్నట్లుగా

కంపెనీ యజమాని కోరుకున్నంతే ఎదిగి, యిక నెదగడం మానేశాడు నీలకంఠం.

నీలకంఠాన్ని అందరూ చిన్నవాడే ననుకోవడంవల్లా, తనకు తానే చిన్నవాడిగా భావించుకోవడంవల్లా అతని వయస్సుకు తగిన మర్యాదాగణ్యతలు పొందలేకపోతున్నాడు. సహజా సహజమైన కారణాలన్నీ కలిసివచ్చి పదిహేడేళ్ళవాడంటే చెల్లని అపరిపక్వత కదాచిత్తుగా అతనిలో గోచరించేది. ఒకానొకవేళచూస్తే, పధ్నాలుగేళ్ళ పాపడుగా అగుపించేవాడు; కాని తెలివి తేటలు గమనిస్తే పదిహేడేళ్ల ప్రాయానికి మించివున్నాయి. మొగంమీద ఎక్కడా వొక్క వెంట్రుక మొలుస్తున్న జాయలేనందున యీ గందరగోళం మరీ అధికతరమయ్యింది. పొగత్రాగుతున్నందువల్లనో, వయసును మించిన మాటకారితనం వల్లనో వాడి పెదిమిలమీద చారలేర్పడి వయోజనిడిగానూ, కష్టజీవిగానూ కనిపిస్తుంటాడు. కాని అతని విశాల నేత్రాల్లో అమాయకత్వం, యౌవనం మెరుస్తున్నాయి. వాడి ఆత్మ యౌవనాభిరామనంగానే వుందని వూహిస్తాను. కంపెనీలో ప్రచారపు ప్రకాశంవల్ల వాడి బహిరరూపంమాత్రం కాపులో అకాలంగా పండిబారిన మామిడిపండుమాదిరిగా కృత్రిమ వికాసం పొందింది.

సుప్రశాంతమైన శరత్ యొక్క యింటిపట్టునా, పెరటి తోటలోనూ నీలకంఠునివిషయంలోకూడా ప్రకృతి తనధర్మం నెరవేర్చుకోడానికి చక్కని అవకాశాన్ని గైకొన్నది. నీలకంఠుడు వొకానొక అసహజమైన యౌవనోల్బణంలో తారట్లాడుతున్నాడు. ఈ నీడపట్టున వాడిలోని పదిహేడు, పద్దెనిమిది

సంవత్సరాలప్రాయం పరిపూర్ణవికాసం పొందింది. ఎవరూ యీ మార్పును గమనించలేదు. వాడిలో మార్పుకో తార్కాణం వుంది. ఎప్పటిలాగానే కిరణ్ వాడనీ పిల్లవానిలాగానే కట్టి ప్రవర్తించబోయేసరికి లజ్జపడ్డాడు. ఒకరోజామె సరదాగా చేటికాపాత్ర నటించమని కోరిన సందర్భమది. ఎందుకో కారణం చెప్పలేదు గాని, స్త్రీ వేషం అభినయించమనేసరికి వాడిలో గొప్ప బాధకలిగింది. మరొకసారి పిలిపించి మళ్ళీ వెనకటి స్త్రీ పాత్రలు నటించమనేసరికి వాడు కంటికి కనబడకుండా మాయ మయ్యాడు.

సంచారక నాటక దళంలో చేతిక్రింద పసిపిల్లవాడినేగదా అనే భావం యిప్పుడు వాడిలో చచ్చిపోయింది శరత్ పనివానివద్ద నాలుగక్షరాలు డొక్కశుద్ధి చేసుకుందామని నిశ్చయించు కున్నాడు నీలకంఠం. పాపం, పరిస్థితులందు కనుకూలించలేదు. యజమానురాలికి తాను ప్రతిపాత్రుడు కావడం వాళ్ళపనివాడికి నీలకంఠంమీద కన్నెర్ర కలిగించింది. విధివిరామంలేకుండా వరస బెట్టి దిద్దిస్తూండేసరికి మనస్సునేకాగ్రంగా నిలపలేకపోయాడు. దానితో వాడి కళ్ళకి అక్షరాలు అలికివేసినట్టుగా అగుపించేవి. అయినా బాస్కి అంతటితో విడవలేదు. పుస్తకంపడ తాననాడు. గంగగట్టున చంపక నికుంజానికి వీపుమోపి వొళ్లో ఆరదెరచిన పుస్తకం పెట్టుకొని గంటల తరబడిగా అలాగే కూర్చుండేవాడు. నీలకంఠుడలా అధ్యయన సమాధిలో కూర్చుంటే కట్టకింద కెర టాలు నిశ్వసించాయి. నావలు తేలి తేలిపోయాయి. కూర్చున్న చెట్టుమీద పక్షులు విరతి లేకుండా పులివు చేస్తున్నాయి. వాడు పుస్తకం పరిశీలిస్తోంటే వాడి మనోఫలకంమీద ఏ భావం మెరి

సిందో-వాడికది తెలుస్తుందో తెలియదోగాని, తెలిస్తే వాడికే తెలియాలి,-ఒక శబ్దం దాటించి మరోశబ్దాన్ని చదివే మహాభాగ్యానికి నోచుకోలేదువాడు. అయినా పుస్తకం చదువుతున్నానుగదా అనే భావంతోమాత్రం వాడిఆత్మ ఆనందపులకితమవుతుండేది. నదిమీద నడిచేనావ తనముందుగా వెళ్తూన్నట్టు గమనిస్తేచాలు, వెంటనే పుస్తకం కనిపించేట్లు ఎత్తిపట్టుకొని గొప్ప అధ్యయనపరుని మాదిరిగా గొంతెత్తి చదువనారంభించేవాడు. నావ అవతలికి గడవడంతోటే గొంతుపడిపోయేది చదవడం చాలించేవాడు,

నీలకంఠం పూర్వమూ గాయకుడే. అయితే ఆనాడుఅంతా ఏదో యంత్ర సదృశంగా పాడేవాడు. అవేపాటలు నేడు పాడుతోంటే, ఆయారాగాలు, కళలు అతని హృదయంలో రసావేశాన్ని నింపుతున్నాయి. పూర్వం పాడితే. పాటలో అర్థానికి ప్రాధాన్యం లేకపోయేది; అర్థవైవిధ్యమంతా ఏవో అల్పమైన మార్పు లనిపించేవి. ఎంత కించిదర్థమూ బోధపడేది కాదు.

ఏల ద్విజపోతమా! ఎగ్గు తలపెట్టితివి ఏల రాచపడుచునకు
ఏల నిటు హంసమా! ఏకారుకోన మాయింపదలతువాపె!!

నేడీగేయచరణాలు ఆలపించుతోంటే ఏదో సుదూర ప్రపంచంలోకి, ఎవరో బహు అపరిచిత జనమధ్యంలోకి గొంపోవబడుతున్నట్లుగా అనుభూతి పొందుతున్నాడు. ఈ సుప్రశస్త భూతలమూ తన నిరుపేద బ్రతుకూ అతనిలో సంగీతమై ధ్వనించింది. అతడు మారిపొయ్యాడు 'దమయంతి-హంసదౌత్యము' అన్నకథ అతని మనోదర్పణంలో జగదేక సౌందర్యమయమూర్తి చిత్రమొకటి ప్రతిఫలించి నిల్చింది. నాటకసమాజానికి అమ్ముడు

పోయిన దిక్కు లేని బానిసబాలుణ్ణిగదా అనే స్వయం స్పృహ అతని స్మృతిపథంలో పూర్తిగా చెరిగిపోయింది. కాని నేడు మరితనేమని భావించుకుంటున్నాడో మాత్రం దురూహ్యంగా వుంది.

నిరుపేద బాలకుడు సాయం సమయాలలో మురికి కూపంవంటి తన యింట ఆకలిలో - అపరిశుభ్రంలో పడివుండి, రాణులు రాజులూ-బంగారు పాతర్లనూగూర్చి కతలు వింటూండగా, మినుకుమినుమని వెల్గే ఆముదపు దివ్వెతో ఆచీకటిగూడు కాంతిల్లితే వాని మనస్సు దారిద్ర్యం, దైన్యం యొక్క సంకెళ్ళు విదల్చుకొని మేల్కాంచి అద్భుత సౌందర్యంతో విహారం సలుపుతుంది. ఎవరి అవరోధభయమూ లేకుండా వాంఛలు సమస్తమూ సుసాధ్యమైన ఆ వూహా ప్రపంచంలో అట్టే కాసేపే నడయాడుతాడు.

సంచారక నాటక కంపెనీయొక్క యీ బానిస ఇలా అర్ధస్ఫూర్తితో పాటలు పాడుకోనడం మొదలుపెట్టాక పైనను కొన్న విధంగానే అతన్ని, అతని వూహా ప్రపంచాన్ని మలచుకో నారంభించాడు. పడవచ్చు కెరటాలు, కదలాడు చివురాకు, వులివాడు పులుగులు దైవానుగ్రహం కోల్పోయిన నిస్సహాయస్థితిలో తనకు ఆశ్రయం యిచ్చిన దయామయ, సౌందర్య వైభవం విరిసిన ఆమె వదనశ్రీ. జిలుగు వన్నె రాసులు మెరసే తామరతూళ్ళవంటి ముంజేతులు, పద్మపత్రాలవంటి ఆమె ఎఱ్ఱని పాదాలు - ఇవన్నీ అతగాని సంగీత మోహినీ విద్యలో ఏకీభూతమైపోయేవి ఇంతలో పాట ముగిసేది. దానితో పాటు యెండమావులవంటి ఆదృశ్యాలూ యింకిపోయేవి. మళ్ళీ

ఎప్పటిలాగే నాటకాల నీలకంఠుడూ, వాడి గిరజాల జుత్తూ తనకు తా ప్రత్యక్షమయ్యేవాడు - అంతలోనే అంటుమామిడి తోట ఆగమాగం చేసి పారేశాడంటూ పొరుగింటి పెద్దమనిషి వచ్చి ఫిర్యాదు చేస్తాడు; శరత్‌బాబు మండిపోతూ గూబలు మెలి వేసి చేతుల కట్టి పడేస్తాడు. కొంటెకోణంగి క్షుద్రమూకలకు మేస్త్రీ అయిన నీలకంఠుడు వూరుకోగలడా? స్థలజల తరుశాఖాగ్ర త్రివిధమార్గాలద్వారా మరో దుండగానికి యుద్ధాప్రకారం పన్నాగం పన్నుకొని తయారయ్యేవాడు

* * *

నీలకంఠుడా యింటిపంచ చేరిన కొద్దిరోజుల్లోనే శరత్ తమ్ముడు, సతీష్ వేసవి సెలవలు గడపడానికి వచ్చాడు. కాల క్షేపానికి సదవకాశం లభించిందని కిరణ్ సంతోషించింది. తానూ మరది సమవయస్కులు. ఆటలు, గిల్లికజ్జాలు, రాజీలు, నవ్వులు, కేరింతలు, కడకు కన్నీళ్ళతోకూడా కాలం హాయిగా జరిగిపోతోంది కిరణ్ వెనుకనుంచీ హఠాత్తుగా వచ్చి పారాణి చేతుల్తో సతీష్ కళ్ళు మూస్తుంది. దొంగేటుగా పొంచి మరది వీపుమీద 'కోతి' అని తాటికాయంత అక్షరాలతో రాస్తుంది సతీష్ వస్తోంటే అతన్ని మధ్యలో పెట్టి తలుపులు వేసి గ్యాలో త్రీ పగలబడి నవ్వుతారు. సతీష్‌కూడా చెయ్యిచచ్చి వూరుకోలేదు. ఆవిడ వుంగరాలు, తాళంచేతులు అంకించుకొని గమ్మున దాచేసేవాడు. ఆమె తాంబూలంలో తెలీకుండా లవంగాలు పెట్టేవాడు. ఆమె మరో వేపుకు చూస్తూన్నప్పుడు పడుకున్న పళంగా ఆమెను మంచానికి కట్టేసేవాడు

ఇంతలో నీలకంఠుణ్ణి ఏదెయ్యం ఆవేశించిందో పెరుమాళ్ళ కెరుక. అతడిలో అకస్మాత్తుగా ఏదో ద్వేషభావం ఆవహించింది. అది ఎవరిమీదో, ఎక్కడో తీర్చుకోవాలనుకుంటున్నాడు. సమయం కొరకు వేచి వుంటున్నాడు. ఈ లోగా వుండబట్టలేక ఆ విసురు అనుచర బృందంమీద ప్రయోగిస్తున్నాడు. వాళ్ళని వొట్టి పుణ్యానికే చావచితక గొట్టేవాడు; ఏడ్చుకొంటూ వాళ్లు ఇళ్ళకు పోయేవాళ్లు. అల్లాగు ముద్దుగా మచ్చిక చేసిన కుక్కపిల్లని వొక్క తాపు తన్నాడు; కైకై మని అరుచుకొంటూ పోయింది. షికారుకని చేతికర్ర పుచ్చుకొని పోతూ దారిప్రక్క పొదల్లో ఆకులూ, రెమ్మలూ త్రోవలో రాలగొట్టుకుంటూ పోతాడు.

కిరణ్ స్వభావతః వొరుల మేలుకోరే మనిషి. నీలకంఠుడు తిండికి తిప్పురాజు. రుచిగల భక్ష్యం ఎన్నిదఫాలు వడ్డించినా వద్దనగల నిర్మొగమోటం లేదు, పాపం. కిరణ్ కట్టెదురుగా కూర్చొని నీలూ చేత భోజనం చేయించడమంటే ఆమెకు ప్రీతి. తిండివద్ద సిగ్గుపడకూడదని భోజననీతి గుర్తుచేస్తూ తినమని ప్రోత్సహిస్తూండేది. ఆ బ్రాహ్మణ కుమారకుడు తృప్తిగా తింటె ఆమె కదోక ఆనందకల్పం. కాని సతీష్ రాకతో యీ నియమం తప్పింది. కిరణ్ కిప్పుడు నీలూముందు కూర్చొని భోజనం వడ్డింపించడానికి సావకాశం దొరకడంలేదు. కాని సతీష్ రాక ముందుకు పూర్వం కిరణ్ ఎప్పుడైనా వచ్చి ఎదురుగా కూర్చొనినా గుర్రవాడి ఆకలికి కొదవ, పరిమితి వుండేదిగాదు. భోజనం పూర్తి చేసి, గ్లాసుడు పాలూ ఖాళీచేసి మూతి కడిగి పెట్టేశేవాడు.

ఇక నిప్పుడంటే కిరణ్ ఎదురుగా కూర్చొని యిదితిను, అది తిను, అని బలవంతం చేయడానికి లేకపోయేసరికి పరిస్థితి వాడికి దుస్సహంగా వుంది. ఏదీ రుచించడంలేదు. ఏడ్పుగదిరిన గొంతుకతో 'ఆకలి వెయ్యడంలేదు' అని వడ్డనకత్తెతో అంటూ అన్నం దగ్గరనుండి లేచిపోతున్నాడు. అనుదినం అలా చెప్పడంలో పరమోద్దేశం వొక్కటుంది. ఎలాగో ఆ వార్తలు కిరణ్ చెవిని పడతాయని, ఆమె ఆందోళన చెందుతుందని, తన్ను పిలిపించి ఎంగిలిపడమని బలవంతం చేసితీరుతుందని అతని భావన. కాని అటువంటిదేమీ జరగలేదు. కిరణ్ చెవులకే ఆ వార్త చేరలేదు. ఆమె రానేలేదు. వీడు మిగిల్చిన విస్తరికాస్తా వడ్డనకత్తె సున్నగా మేసేసి చెయ్యి కడుక్కొని అవతలికి పోయేది. వీడో గదిలో దివ్వె ఆర్పేసుకుని చీకట్లో మంచంమీద పడి తలగడాలో మొఖం దాచేసుకొని ఏకధారగా ఏడ్చేవాడు. ఇంతకూ వాడి ఆవేదన ఏమిటి? ఎవరిమీద? ఎవరివల్ల వుపశమిస్తుంది? అదెవరికీ పట్టలేదు. కట్టకడపటికి నిద్రామాతయే తల్లిలేని ఆ పిల్లవాని గాయపడిన హృదయాన్ని మృదువుగా లాలించి వోదార్చేది.

తనకు వ్యతిరేకంగా సతీష్ కిరణ్ మనసు విరుస్తున్నాడని నీలకంఠుడికి గట్టి నమ్మకం. కిరణ్ ఏదో పరధ్యానంలో వుండి తన్ను చూసి యథాపూర్వంగా చిరునవ్వు చూపక పోయిందా, సతీష్ ఏదో కృత్రిమంచేసి తనమీద కోపం తెప్పించి వుంటాడనే తీర్మానించుకునేవాడు. రాగలజన్మలో తాను సతీష్ స్థానంలోను సతీష్ తన స్థానంలోనూ పుట్టాలని వాడి అక్కసంతా వెళ్ళబోసుకుంటూ యిష్టదేవతా ప్రార్థనలు గావించుకొనేవాడు. బ్రాహ్మణునికోపం ఎన్నడూ వృథాపోదనేనమ్మకం

కూడా వుంది. సతీష్ తన శాపాగ్నిలో శలభంలా వేగించాలని యత్నించినకొలదీ వాని హృదయతాపమే అధికమయ్యేది. అప్పుడే వదినెగారితో సతీష్ నవ్వులూ చమత్కారాలు మేడమీద వినిపిస్తుండేవి.

సతీష్ యెడ ద్వేషాన్ని బాహాటంగా కనబరచడాని కెన్నడూ సాహసం చెయ్యలేకపోయాడు. కాని సతీష్‌కు చీకాకు కలిగించడానికి వెయ్యి దారులు వెదుకుతాడు. రేవులో మెట్లమీద సబ్బుపెట్టి నదిలో సతీష్ యీత గొట్టి లేచివచ్చి చూచుకొనేసరికల్లా సబ్బు కనబడదు. సతీష్‌కి గళ్ళలాల్చీ వుంది. అదంటే గొప్ప యిష్టం. ఒకనాడది ఏట్లోబడి అందకుండా కొట్టుకుపోయింది. గాలికి కొట్టుకెళ్ళి పడిందని కాబోలు తలంచాడు.

సతీష్‌కు వేడుక చెయ్యాలని కలిగింది కిరణ్‌కు. ఎప్పటి లాగే గానాబజానా చేయవలసిందిగా నీలకంఠుని పిలిపించింది. వచ్చి ఏడుపుమొగం వేలాడేసి నిలబడ్డాడు. కిరణ్‌కు ఆశ్చర్యం కలిగింది. విషయ మేమిటో అడిగింది కాని కిమిన్నాస్తి, జవాబు లేదు. ఆమె కిష్టంగావుంటే కీర్తన వొకటి పాడమంది మళ్ళీ. 'నాకు గుర్తులేదు' అంటూ అవతలికి వెళ్లిపోయాడు.

* * *

ఆ కుటుంబం స్వగ్రామం వెళ్లిపోవాలనుకొంది. ఎవరికి వాళ్ళు మూటాముల్లె సర్దుకుంటున్నారు. సతీష్ వాళ్ళతో పాటు వెళ్తున్నాడు. నీలకంఠుని కెవ్వరూ ఏమాటా చెప్పారు కారు. వాణ్ణికూడా తమతో తీసుకెళ్తారో, దిగబడమంటారో ఎవరికీ పట్టలేదు.

యథార్థానికీ విషయం కిరణ్ కదిలించింది. వెంట తీసుకు పోదామనే అంది. కాని భర్త, అత్త, మరదీ ఏకగ్రీవంగా వ్యతి రేకించారు. అంతటితో ఆమె ఆ ప్రమేయం మానుకోవలసి వచ్చింది. రెండు రోజుల్లో ప్రయాణ మవుతారనగా వాడిని పిలి పించింది. 'మీ యింటికి వెళ్ళునాయనా' అని బుజ్జగింపుగా సలహా చెప్పింది.

ఇంత కాలమూ తనమాట పట్టించుకోలేదని బాధపడ్డా డేమో, యిప్పుడీ బుజ్జగింత భరింపరానిదయింది. ఒక్క మారుగా పటపట కన్నీరు కార్చాడు. కిరణ్ కళ్ళల్లోకూడా నీళ్లు తిరి గాయి. ప్రేమబంధం పెంచీ పెంచీ యివ్వాళ కోయాల్సి వచ్చిందిగదా అని దిగులుపడింది.

ఎదిగిన కుర్రవాడు ఏడిచి చీదేస్తోంటే సతీష్‌కు కంపర మెత్తింది. "మాటాడేందుకు బదులు శోకాలు పెడతాడెందుకీ వెధవ?" అన్నాడు సతీష్. జాలిమాలినవాడివని కిరణ్ సతీష్‌ను మందలించింది. "వదినగారూ! మీకేమీ తెలిదు మీరు అతిమంచి. తేలికగా నమ్ముతారు. ఈవ త్తైన్న మీకు భగవంతుని దగ్గరనుండి వూడిపడ్డాడు. మహారాజుగారిలాగా మేపుతున్నారు. పులి మళ్ళీ ఎలుక నవుదామనుకొంటుందా? మీ గుండెను కరిగించడానికి కన్నీరుకన్నా గొప్ప వుపాయం లేదని కనిపెట్టేశాడు."

అక్కడనుండి నీలకంఠు తక్షణం వెళ్లిపోయాడు. సతీష్‌ను ముక్కముక్కలుగా కోసెయ్యడానికి కత్తినైతే బావుండును. లోపలికంటా దిగేసుకుపోడానికి సూదినైతే బావుండును. గుప్పెడు బూడిదగా మాడ్చేయడానికి అగ్నినైతే బావుండును.

కాని సతీష్ భయపడనుకూడా లేదు.

సతీష్ కలకత్తానుండి వస్తూ వస్తూ చక్కని సిరాబుడ్డి కొనితెచ్చుకున్నాడు. ముత్తెపుచిప్పనావలో సిరాబుడ్డీ వుంటుంది. ఆ నావ నొక సత్తు హంస నడుపుతుంటుంది. ఆ హంస మీద కలాలు పెట్టుకొనేందుకు ఏర్పాటు వుంది. అసని కదెంతో యిష్టమైన వస్తువు.పాతదొకపట్టు జేబురుమాలుతో అనుదినం అతి జాగ్రత్తగా దాన్ని తుడిచి పెట్టుకుంటాడు.

"ఏల ద్విజపోతవరా! ఎగ్గుతల పెట్టితివి ఎలరాచపడుచునకు...." అంటూ పాడుతూ ఆ హంసముక్కును వ్రేలితో కొడుతూ కిరణ్ నవ్వుతుండేది ఆపైని ఆమెకూ, మరదికీ తీసిపోని వాగ్యుద్ధం యధాప్రకారం రగిలేది.

రేపు బయల్దేరుతారనగా ఆ సిరాబుడ్డి మాయమై పోయింది. కనిపించలేదు. కిరణ్ "సతీష్! మీ హంసరాజుగారు మీ దమయంతిని చూచిరావడానికి వెళ్ళారు" అని నవ్వింది,

కాని సతీష్ మండిపోయాడు. నీలకంఠమే దొంగిలించాడని సతీష్ సునిశ్చితాభిప్రాయం. గతరాత్రినాడు సతీష్‌గది దగ్గరే తారట్లాడాడని పలువురు చెప్తున్నారు. నేరస్థుణి తెచ్చి కిరణ్ సమక్షంలో నిలబెట్టాడు. "నువ్వే సిరాబుడ్డి తీశావు, దొంగవెధవా! తీసుకురా!" అని కేకలు వేశాడు. న్యాయమో, అన్యాయమో శరత్ శిక్షిస్తే కిమ్మనకుండా పడి వుండేవాడు. కాని ఇప్పుడు కిరణ్ సమక్షంలో దొంగ అనిపించు కొనేసరికి కళ్ళు ఎర్రగించి చూచాడు. రొమ్ములనిండా గాలి తీసుకున్నాడు. గొంతుక బొంగురుపట్టింది. సతీష్ మళ్ళీ ఆ మాట

న్నాడు అంటే వేకెత్తిన పిల్లిలా పైనపడి గోళ్ళతో రక్కి చీరేసేవాడే.

అదంతా చూచి కిరణ్ క్రుంగిపోయింది. కుర్రవాణ్ణి మరోగదిలోకి గొనిపోయి మధురంగా, మన్ననగా అంది: "నీలూ, నిజంగా తీస్తే, నా కిప్పు తొందరగా. మళ్ళీ నిన్నొక మాట అననివ్వకుండాచేస్తాను". కన్నీరు క్రమ్మింది. చేతుల్లో మొగం దాచుకొని బిగ్గరగా ఏడ్చాడు. కిరణ్ గదిలోవుంచి వచ్చి, "నీలకంఠుడు తియ్యలేదు ఖాయంగా చెబుతున్నాను అన్న దమ్ము లిద్దరికీ దొంగ నీలూ అనే దృఢమైన నమ్మకం".

అయినా కిరణ్ నమ్మదల్చుకోలేదు.

శరత్ కుర్రవాణ్ణి క్రాసుపరీక్ష చేయదలచాడు; కాని కిరణ్ వల్లకాదని అడ్డుకొంది.

వాడి గది, పెట్టె తనిఖీ చేదామన్నాడు సతీష్. "అపనే జరిగితే సతీష్, నీకు క్షమార్హత వుండదు. అమాయకుడైన పేదింటి పిల్లవాడిమీద సోదా జరిపిస్తావా!"-అలా మాట్లాడు తూండగానే ఆమె కళ్ళు చెమ్మగిల్లాయి. అంతటితో విషయం సమాప్తమయ్యింది. నీలకంఠుడికి మరే ముప్పురాకుండా కట్టు దిట్టం జరిగిపోయింది.

నిలువనీడలేని పసినిసుగుమీద జులుం చేసే ఆ ప్రయ త్నానికి కిరణ్ గుండె నీరయింది రెండేసి కమీజులు, పరా యిలు, జత చెప్పులు తెప్పించి, కరెన్సీనోటొకటి పట్టుకొని సాయంకాలం నీలకంఠుని గదిలో మెల్లగా ప్రవేశించింది వీటిని వీడ్కోలు బహుమానాలుగా వాడిపెట్టెలో వుంచి పోదామని వుద్దేశించింది. అసలా పెట్టె కూడా ఆమె యిచ్చినదే.

తాళంచేతుల గుత్తిలో వుంచి ఆ పెట్టెకు సరిపడే చెవిని యేర్చి నిశ్శబ్దంగా పెట్టె తెరచింది, నానాచెత్తా అందులోనే కుక్కేసివుంది. ఇంకా యీ బట్టలకు చోటు లేకపోయింది. అన్నీ దిమ్మరించి మళ్ళీ పెట్టె చక్కగా సర్ది పెడదామనుకొంది. కత్తులు మూతలు గాలిపడగలు ఎగరవేసే దారపుబంతులు వెదురు పిల కలు, మామిడికాయల తొక్కవొల్చే నున్నని గుల్లలు, పగిలిన లోటా అడుగులు, ఇంకా యిలాంటివే బాలహృదయాన్ని ఆకర్షించగలిగే సామాగ్రి అంతా ముందు కనిపించింది. ఆ దిగు వన చక్కగా కప్పిన లినెన్ తెర కన్పించింది. ఆ లినెన్ తెర క్రింద నుండి పోయిన సిరాబుడ్డీ, హంస, అదంతా ప్రత్యక్షమయింది.

కిరణ్ విచారవదనంతో సిరాబుడ్డితో చేతిలో పట్టుకొని నిస్పృహోయంగా చతికిలబడిపోయి పాలుపోక, ఆశ్చర్యపడుతోంది.

ఇంతలో వెనకనుండి వచ్చి నీలకంఠుడు గట గడపలో నిల్చున్నాడు. కిరణ్ కనిపెట్టలేదు. దొంగని దొంగగా పట్టడాని కనే కిరణ్ యిలా వచ్చిందని భావించాడు తన నేరం బట్టబయు లయిందనుకొన్నాడు. తాను దొంగను కానని, కసికొలదీ అలా చేయవలసివచ్చిందని, అవకాశం చిక్కగానే దాన్ని ఎట్లో విసి రేద్దామని వుద్దేశించానని చెప్పి వొప్పించగలనని వాడెలా ఆశించగలుగుతాడు? హృదయ దౌర్బల్యం ఆవేశించిన వొకా నొక క్షణంలో దాన్ని తెచ్చి పెట్టెలో పెట్టాడు. 'నేను దొంగను కాను....దొంగను కాను....'' అతని అంతరాత్మ చెప్తుతోంది. అయితే అతడేమిటి? ఏమని చెప్పుకోగలడు? కిరణ్ అపోహపడు తోందని ఎన్నటికీ వివరించి చెప్పజాలడు. తనమీద ఆమె అను

మానించి ఆమె సోదా చేస్తోందని అనుకున్నాక, అంత విషయాన్ని భరించగలడు.

కడకు కిరణ్ సిరాబుడ్డిని పెట్టెలోనే వుంచేసింది. నిట్టూరుస్తూ తానే దొంగ నన్నట్లుగా దానిమీద లినెస్ కప్పేసింది. అన్నింటికీ పైన తానిస్తున్న బహుమతులూ, నోటూ వుంచేసింది.

* * * *

మర్నాడు కుర్రవాడెక్కడా కనిపించలేదు. గ్రామస్తులెవరూ చూడలేదన్నారు. పోలీసులకుకూడా ఆచూకీ తెలియలేదు. 'అయినా వూరికే వాడి పెట్టె చూడొచ్చునుగదా, ఇప్పుడైనా' అన్నాడు శరత్. కిరణ్ ససేమిరా, అటువంటిపని కూడదన్నది.

పెట్టె పసగదిలోకే తెప్పించుకొంది సిరాబుడ్డి అందులోనుండి తీసేసి గంగానదిలో విసిరేసింది.

కుటుంబమంతా స్వగ్రామం వెళ్లిపోయింది. ఒక్కరోజులో పెరటితోట నిర్జనమయింది. గుండెలవిసేట్లుగా పద్మశ్రీ నీలకంఠుడి పెంపుడు కుక్కమాత్రం కాలే కడుపుతో తోటలో అలంగరాలు తిరిగింది.

— సమాప్తం —